

# మన
# వారసత్వము

సంస్కృతి ప్రచురణ

# ఆర్య సమన్వయము

పురాతనకాలమునుండియు నీ భారతభూమి భిన్నజాతులకు, సభ్యతలకు సంగమస్థానము. తన జీవనభాగీరథియందలి సంకీర్ణప్రవాహముల నాదికాలము నుండియు భారతధరిత్రి ఏకవాహినిగా మలచికొనుచునేయున్నది. తనతో బుట్టిన సభ్యత లన్నియు మాసిపోయినను, పురాతనభారతసభ్యతమాత్ర మవిరతచరిత్ర సంపన్నమై నిలిచియున్నది. నిలుచుటే కాదు; క్రమపరిణతమైన సంస్కృతికి గారణమైనది. భిన్నభిన్నజాతు లీ నేలపై జేరి యొండొంటితో గలహించియు గలసిమెలసిపోయినవి. ఈ పురాణభూమి వారి నందఱిని దన కడుపునబెట్టుకొని కాపాడినది. అహమహమికచే నిచట పోరాడిన భిన్న సంస్కృతు లన్నిటిని సానబెట్టి, ఆ యమ్మ వారికి దనరూపమే దిద్దినది. విజాతులును, విధర్మములు నామెతిరుగిలిలో దిరిగి యొక్కటియై పోయినవి. వారివారి కలహము లన్నియు నిచట నూతన సమన్వయశుభపరిణతి నంది, మానవజాతి యుదారజీవననిశ్రేణిపై కెక్కినది. శతాబ్దులకు శతాబ్దు లా తల్లికి రణగుణధ్వనులతో, ఈతిబాధలతోడనే తెల్లవారినవి. దైవికరాజకములగు విపత్తు లన్నిటి నామె గడచి గట్టెక్కినది. అజరామరమైన యీ ప్రాణశక్తియు, విరుద్ధధర్మములను బరిష్కరించు నీ జ్ఞానశక్తియు నామె కెక్కడివి? పురాతనసంప్రదాయములతోనూతనపురుషార్థములను సమన్వయించి ఏకమొనర్చి, పరిష్కరించి, పరిణతినందించిన ఆమె యాత్మ సంస్కృతియే యిందులకు బరమప్రమాణము.

# మన వారసత్వము

రచన:

హుమయూన్ కబీర్



ఆంధ్రీకరణము:

కాటూరి వెంకటేశ్వరరావు



సంస్కృతి ప్రచురణ

(48)

వెల రూపాయిన్నర



సమన్వయ ఐక్య అభ్యుదయములకు
మూర్తు లన నొప్పు
మౌలానా అబుల్‌కలాం అజాద్,
పండిత జవాహర్లాల్ నెహ్రూలకు
అంకితము

# తొలి పలుకు

శ్రీశాయజీరాయల స్వర్ణోత్సవోపన్యాసములు 1943
లో నావంతునకు వచ్చెను. ఏకము, సంతతము నగు భార
తీయసంస్కృతినిగూర్చిన భావపరంపరను నే నపుడు గూడ
బలికికొని సంగ్రథనమొనర్చుకొంటిని. నేటి చరిత్రగ్రంథము
లందు ఉపేక్షితములగు భారతీయసభ్యతాలక్షణములనుగూడ
పరామృశించుచు నే నపుడు చేసిన ప్రసంగము లానాడే
ముద్రితమై, మరల నే డీగ్రంథమున 1, 2 ప్రకరణములుగా
నవతరించినవి. ఆ ప్రసంగము లొనర్చుటకై బరోడా మహా
రాజులుంగారు అప్పుడు నన్ను పిలువనంపుటయే ఇపు డిట్లు
ఫలించినదిగాన వా రొనర్చిన మేలు మఱవజాలను.

భారతమువంటి పెద్ద దేశమునుగూర్చి మన మే విషయ
మును ఇట్టె సూత్రీకరింపలేము. సుదీర్ఘము, చిత్రవర్ణము
నగుభారతేతిహాసముపై పరస్పరవిరుద్ధములగు వ్యాఖ్యానము
లెన్నియేని చేయవచ్చును. అతివిస్తృతమగు ఈ పురాతన
భూమిలో నానాత్వమును, సంకీర్ణతయు గన్పింపకమానవు.
కావున భేదముల నెత్తిచూపగోరువారికి గావలసినంతసామాగ్రి
దొరకుచుండును. అట్లయ్యు, నానావిధమగు భారతజీవన
గర్భమునం దేకాత్మత ఉండనేయున్నది.

భారతభూమి హిందూముస్లిములకు రణరంగమనియు,
సంస్థానాధీశులకు కేళీమందిరమనియు బరదేశములందు
ప్రచారము జరగినది. నిజమునకు భారతదేశచరిత్రమున
దీనికి ప్రాధాన్యము లేదుగావున ఈ గ్రంథమున ఆ ప్రస్తా

వమును బుద్ధిపూర్వకముగానే విడిచిపెట్టితిని. భారతదేశ మొక మహాభూఖండమువంటిది. దాని చరిత్రయు నిన్న మొన్నటిది కాదు. ఇచట నివసించు నలుబదికోట్ల ప్రజలను, బ్రతుకుతెరువు లేక వారు పడుఅగచాట్లను విచారించి చూచి నపుడు క్షీ మతకలహములును, సంస్థానపతులభోగభాగ్యములును ఆ మహాప్రవాహమున బుద్బుదప్రాయములై కన్పించును. దేశమంతట భిన్నభిన్న మతస్థులు ఆదరసౌహార్దములతో కలసిమెలసి జీవించుచుండ, ఎక్కడనో అప్పుడపుడు తల యెత్తు కలహము లొక లెక్కలోనికి రావు. నోరులేక జడీభూతమైయున్న ప్రజాకోటి ఒక్కుమ్మడి, నీరవమై ప్రవహించుచుండ, సంస్థానాధిపతుల భోగములు ఆ మహాప్రవాహమున నలుసులై పోవును. ఆ ప్రజాకోటియు, దాని జీవనము మాత్రమే మనకు గావలసినది.

ప్రకృతిప్రపంచము భిన్నాశయములతో, భిన్నభావములతో ఘూర్ణమానమగుచుండ, ప్రధానాశయములును, ధర్మములును అడుగునబడి, ప్రత్యక్షములగు భేదములు మాత్రము తేలియాడుచున్నవి. భారతభూమి యన్ననో, విశిష్టములగు దృక్పథములకు హానిచేయని సమన్వయమార్గము బట్టినది. బలాత్కారముపొంత బోకుండగనే భారతము ఆత్మైక్యమును సాధింపగల్గినది. ఆ యైక్యమును మరల దర్శించి, చిరాగతసంప్రదాయధర్మ సంభృతమగు నవభారతము నద్దానిపై మనము నిర్మింపగల్గితిమేని భారతభూమియు, మానవలోకమునుగూడ జరితార్థములగును.

హుమయూన్ కబీరు

# విషయానుక్రమణిక

—*—

## ఆర్యసమన్వయము



## మధ్యయుగపు బరిష్కృతి



## క్రొత్త బుగబుగలు

# ప ట ము లు


1
2
3
4
5
6
11
12
ఇండియాపై
1. ఆర్యులు
2. పర్షియనులు
3. గ్రీకులు
4. పార్థియన్లు.
5 హూణులు
6. అరబ్బులు
7. పఠానులు
8. అహోములు
9. దురానీలు
10. మొగలులు
11. పోర్చుగీసు
12. ఆంగ్లేయులు




## ఇండియాపై దండయాత్ర చేసినవారు

| | | | |
|---|---|---|---|
| 1. ఆర్యులు | .... | క్రీ. పూ. | 2500 |
| 2. పర్షియనులు | ... | క్రీ. పూ. | 500 |
| 3. గ్రీసులు | .. | క్రీ. పూ. | 300 |
| 4. పార్థియన్లు, సిథియన్లు | ... | క్రీ. పూ. | 100 |
| 5 హూణులు | .... | క్రీ. శ. | 6-వ శతాబ్ది |
| 6. అరబ్బులు | .... | క్రీ. శ. | 8-వ శతాబ్ది |
| 7. పఠానులు | .... | క్రీ. శ. | 11-వ శతాబ్ది |
| 8. అహోములు | .... | క్రీ. శ. | 13-వ శతాబ్ది |
| 9. దురేనీలు | .... | క్రీ. శ. | 18-వ శతాబ్ది |
| 10. మొగలులు | .... | క్రీ. శ. | 16-వ శతాబ్ది |
| 11. పోర్చుగీసులు | ... | క్రీ. శ. | 15-వ శతాబ్ది |
| 12. ఆంగ్లేయులు | .... | క్రీ శ. | 17-వ శతాబ్ది |

# 1

# అనేకత్వమం దేకత్వము

ఈ దేశమున కెత్తివచ్చినవారిలో ఆర్యులే ప్రథములనియు, వారు వచ్చునాటి కీదేశ మాటవికముగా నుండెననియు మొన్నమొన్నటిదాక అనుకొంటిమి. కాని, యిటీవలి పరిశోధనలవలన, ఆర్యులకంటె ముందే మఱికొంద ఱీభూమికి వచ్చిరనియు, ఆర్యనాగరికతకంటె వారిది యుత్తమమనియు దెలియవచ్చుచున్నది. అట్లు తాము వచ్చునాటి కిచట నున్నవారి నా యార్యపూర్వులు పోఁద్రోలి, తమ సభ్యత నిచట నెలకొల్పిరి. ఆ సభ్యతావిస్తృతియు, లోతుపాతులు నపురూపములని పండితు లూహించుచున్నారు. ఆపిమ్మట నిచ్చటికి వచ్చిన ఆర్యుల సభ్యత ఆ ప్రాతసభ్యతను తనలో గలిపికొని, క్రొత్తరూపెత్తినది. ఇట్లే కాలాంతరములం దీభూమిని జయింపవచ్చిన శూరజాతు లన్నియు భారతజాతి యనెడి పుటపాకమున గలసిపోయినవి. యవన శకహూణాదు లెందఱో, విజేతలై వచ్చి, యిచటి విజితులలో లీనమైపోయిరి.

క్రొత్తజాతులు, భావములు నిట్లు వచ్చి తనలో బడుచున్నకొలది భారతజాతి యంతకంతకు బదనెక్కి, వానిని దనలో నిముడ్చికొని, సమన్వయించుకొనుట పరిపాటియై పోయినది. ఆ సమన్వయము చక్కగా గుదిరినపుడు, అందుండి నూత్నధర్మ మొకటి వికసించినది; బొత్తుగా

అన్వయము పొసగనిచో క్రొత్తప్రాతలు రెండు నిరుః పొరుగున నుండిపోయినవి. అంతియే కాని, కళ వెళలాడు కషాయభాండమువంటి భారతజీవన మెన్నడు జల్లనాఱి పోలేదు. ఎప్పటికప్పు డాభాండమందు క్రొత్తదినుసులు వచ్చిపడి, భారతజీవనమును సంపన్నము, శబలము నొనర్చె నవి. ఎడపదడప బైకుబుకుచు వచ్చిన ఆచార సంప్రదాయ ముల నేనాటికైన కూలంకషముగా దఱచిచూచినచో, అవి అప్పటప్పట వచ్చిపడిన క్రొత్తజాతులవని తేటపడును. అంత వఱకు అనుమానమే ప్రమాణము. అయ్యు నొక్కటి మాత్రము నిశ్చయము. ఎద్దియన – భారతీయము లనిపించు కొను నాచారములు, సంప్రదాయములు, సంస్థలు, శబ్ద ములు, అర్థములు—ఇవి యన్నియు వివిధస్వరముల సమ్మే ళనములు, వివిధద్రవ్యముల పుటపాకములు మాత్రమే.

మూలమం దిట్టి అనేకత్వమున్నను, తత్ఫలితముగా నెన్నియో రూపములు, తెగలు నేర్పడినను భారతీయ సంస్కృతియందలి ఏకాత్మతమాత్ర మనేక కాలములనుండి సంతతమై, స్పష్టమై కనిపించుచున్నది. అడుగున కన్పించు ఈ ఏకధారయే భారతసంస్కృతి ప్రవాహమునకు విశేష లక్షణము. విస్తరతను, వయస్సునను భారతనాగరికతకు చీనానాగరికత యొక్కటిమాత్రము సరిపోలిన సరిపోలు నేమో! అంతియే కాని ఇంతటి వైశాల్యము, జనాధిక్యము, జాతినైవిధ్యము, సుదీర్ఘమైన చరిత్రము మఱియెక్కడ కానవచ్చుట యరిది. ఎన్నియో పోటుపాటుల కగ్గమయ్యు నేటివరకు బ్రతికియున్న భారతసంస్కృతి కెంతటి పిండబల

మున్నదోకదా! ఊరక బ్రతికియుండుటే కాదు; మున్ముందు రానున్న ప్రపంచసంస్కృతి ముఖ్యముగా దీనినుండియే వికసించు ననిపించునంతటి శక్తికూడ దీనికి గద్దు. రంగులో, నేతలో, నూలులో నెన్నిభేదము లున్నను, వీటి యన్నిటిచే భారతజీవనపటము నందగింపజేసి, ఏకత్వము గూర్చెడి భారతీయతాముద్రయే దీని కింతటిప్రభావమును గల్పించినది.

భారతసంప్రదాయమున కీసంతతధార నేకత్వసమత్వములే సమకూర్చిపెట్టినవి. పురాతనకాలమున దేశాంతరముల వికసించిన నాగరికత లన్నియు లోపించినవి కాని భారత చీనాదేశములం దట్లు లోపించలేదు. ఇతర దేశములందు ప్రాతవి నశించి, క్రొత్తనాగరికతలు తలయెత్తినవి. భారతమునమాత్రము ప్రాతసభ్యత, సంస్కృతి విస్తరించి, పరిణతిచెందినవేకాని మూలమందున్న ఏకత్వము నించుకయు గోల్పోవలేదు. చీనాలోగూడ గొంతవర కిట్లే జరిగినది. ఒడుదుడుకులను సర్దుకొనిపోగల భారతజీవనమే ఈయేకత్వమును రక్షించినది. అట్లుసర్దుబాటుచేసికొనుట జీవలక్షణము. భారతీయుల భావములు, వారి ధర్మశాస్త్రములు కాలమును, నిమిత్తమునుబట్టి అతిసులభముగా, అనుపమానముగా చేసికొనుచువచ్చిన సర్దుబాటులే భారతసభ్యత నింతకాలము తెంపులేకుండ రక్షించిన సంజీవనమంత్రము లని చెప్పవచ్చును.

భారతేతిహాస మంతట గనుపించు సహనశీలమే ఈ సర్దుబాటుతనమునకు కొంత కారణమని యెంచవచ్చును. భారతీయజీవనమం దంతట ఈ పరశ్రేయస్సహనమే కన్పిం

చును. ఈ యోరిమి ఒక్కొకపుడు శ్రుతిమించిపోయి, విరుద్ధ ధర్మములకుగూడ నిలువనీడ నిచ్చినది. స్వసౌఖ్యమునకు హానిగూర్చు కీడుపట్లగూడ నుపేక్షవహించినది. ఎంత చెడినను, ఇది సుగుణదోషమేగాని మఱియొకటి గాదు. స్వసౌఖ్యమునకై పరపీడనమునకు బాల్పడు దురాగ్రహావిమూఢభక్తికంటె ఈ తాలిమియే మేలిమి యేమో!

ఈ యేకత్వము శుష్కసమత్వమాత్రముగా నెన్నడు నుండలేదు. భారతేతిహాసమున వాటిల్లిన యొడుదుడుకుల నన్నిటి నోర్చి, భారతీయజీవనగర్భమున నిండారి, సజీవమై యున్నది. విశేషవైవిధ్యమునుండిగాని సామాన్యము జనింపదు. విశేషధర్మైకదేశముచే నది బర్యాప్తమును గాదు. కేవల సత్యముగూడ నుపాధిభేదముచే భిన్నమై తోచును గదా! ఆ భేదమే జగద్వ్యవహారమును సాగించుచున్నది. ఇంద్రియానుభూతిగూడ వ్యక్తిభేదముచే భిన్నమగుచుండును. ఇక రూపభేదము ప్రత్యక్షమేకావున వేఱ చెప్పబనిలేదు. కావున దేశకాలనిమిత్తములచే భిన్నములై కనిపించు పదార్థములనుండియే సామాన్యధర్మము పుట్టుచుండును. అట్టి సమానధర్మమే భారతసంస్కృతియందలి ఏకత్వమునకు జీవగఱ్ఱ. మతభేద శాఖాభేదములా యేకత్వమును బాధింపవు సరిగదా, ఆ భేదముల కన్నిటికి దానే పాలకమై, ఒక్క త్రాటితో గట్టివేయనేర్చిన దది.

ఇట్టి యేకత్వసమత్వములే సంస్కృతిని సజీవమొనర్చును. అవి లేనిచో సంస్కృతియే లేదు. ఒక్కలక్షణముచే నేసంస్కృతిని నిర్వచింపజాలము. ప్రధానములు, నప్ర

ధానములు నగు ననేకలక్షణముల సంకీర్ణతచే సంస్కృతి రూపెత్తుచుండును. మఱి, సభ్యతకు, సంస్కృతికి భేద మెచ్చట ననగా—గృహస్థజీవనసౌలభ్యమును సమకూర్చు సంఘవ్యవస్థను నిర్మించునది సభ్యత. అట్టి వ్యవస్థవల్లనే వ్యక్తులు ఫలప్రదములగు తమతమ కర్మల నాచరింపగల్గుట. అట్టి సంఘవ్యవస్థకు ఫలరూపమై, సాహిత్యాది కళలలో, ధర్మములలో, తత్త్వమీమాంసలలో, ఆచారసంప్రదాయములలో, అర్థనీతిరాజనీతులలో వ్యక్తమగునది సంస్కృతి. వీనిలో నేయొక్కటియు సంస్కృతికి లక్షణము కానేరదు. వీటి యన్నిటి ముద్రను దాల్చిన జీవనభంగియే సంస్కృతి యనిపించుకొనును. సంఘవ్యవస్థను నిర్మించునది సభ్యత; ఆ వ్యవస్థనుండి వికసించునది సంస్కృతి. కావున సభ్యత లేనిచో సంస్కృతియు నుండదు. సంస్కృతియందు బరిణమించని సభ్యత లుండిన నుండవచ్చు. అనగా, గొన్ని సభ్యజాతుల్లలో, సంస్కృతచిత్తులగు జనులు పరిమితులై యుండుట తరచు సంఘటిల్లునని తాత్పర్యము. కావుననే సభ్యములగు జాతులును, తెగలును గొన్ని నాడు, నేడు నున్నవి. అంతియకాని సర్వతస్సంస్కృతమైన జాతియు, తెగయు మృగ్యములు. కావున సంస్కృతి సభ్యతనుండి పుష్పించును.

పంచభూతప్రకృతిని వశీకరించినగాని సంస్కృతి యంతట నల్లుకొనదు. మానవుని శక్తియు, వాని సాధనములును బరిమితములు గాన నాతడు సంఘజీవనము నలవరచికొని, తద్ద్వారమున బ్రదుకుదెరువు గల్పించుకొన్నాడు. బ్రదుకు నిశ్చయమైనమీదటగాని సంస్కృతికి బునాదు

లేర్పడవు. కావున మరణాదిభీతినుండి విడివడిన భద్రజీవన మునకు ఫలమే సంస్కృతి. మఱి సభ్యత యన్ననో, అట్టి భద్రజీవికకై సమకూర్చుకొన్న సాధనసంపద. కావున సభ్యత కుండు పరివ్యాప్తి సంస్కృతి కుండజాలదు. భారతీయ సంస్కృతి అట్లుకాక, సభ్యతతోపాటు అంతట నల్లుకొనిపోయినది. అపురూపమగు నీ సంస్కారవ్యాప్తి భారత దేశమున దక్క నింకొక్కచో గనరాదు.

యూరపుఖండ దేశములలో సభ్యతయే కాని సంస్కృతి కన్పించదు. సభ్యతకు వలయు సాధనసంపద యున్నది వారికి. ఆ సభ్యతనుండి సంస్కృతిని సాధించు మార్గ మా దేశస్థులకు గోచరించుట లేదు. యూరపుసభ్యతకంటె భారతీయసభ్యత సాధనసంపదయందు వెనుకబడినమాట నిజమే కాని, ఇచటి సభ్యతచే వికసించిన సంస్కృతి ప్రజాబాహుళ్యమం దెల్లెడ వ్యాపించి సౌరభము వెలార్చుచున్నది. ఇచటి ప్రజలలో అదృష్టలోపముచే, విద్యావిహీనతచే గన్పించు భేదములే కాని సంస్కృతిభేదము లేదని అలవోకగా వచ్చిపోయెడి వైదేశి కులకుగూడ దెల్లమే. యూరపుప్రజలలో నెలకొన్న వర్గ భేదము లట్టివి కావు. ప్రజాస్వామికమే తారకమని నమ్మి, ఆస లన్నియు దానిపై నిడుకొన్నవారినిగూడ నచటి భేదములు సంశయగ్రస్తుల నొనర్చుచున్నవి. సాంకేతిక విద్యావ్యాప్తిచే నీభేదములు సమసిపోలేదు సరికదా, మానవులు జడయంత్రము లైపోవుచున్నారు. భారతదేశమం దట్టి సాంకేతిక విద్యావ్యాప్తిలేకున్నను ఇచటి పల్లెలలోని శిల్పుల సహజకౌశలము కొఱవడలేదు.

భారతసంస్కృతి ఏకము, సంతతము నగుటయే ఇట్టి వింతకు గారణమని చెప్పదగును. ఏకత్వము సంస్కృతికి సామాన్యలక్షణమేకాని సాంతత్యము మాత్రము భారత సంస్కృతికి విశేషలక్షణము. తెగతెంపులును, బలవన్నిరోధములు నెఱుగక, భారతసంస్కృతి ఏకధారగా నానాటికి విస్తరిల్లి, సర్వవర్ణములను, అంతరములను దనలో కరగించినైచినది. భారత దేశ చరిత్ర అతిదీర్ఘమగుట ఇందుకు గొంత వట్టు కారణము కావచ్చును; కాని ఎంతటి పురాతన చారిత్ర సంపద యున్నను, సహనశీలము లేనిచో భారతీయ సంప్రదాయము లేకమై, అవిచ్ఛిన్నములై ఇట్లు నెగడజాలవు.

## 2

## భౌగోళికధర్మ ప్రాబల్యము

భారత దేశ భూగోళపరిస్థితులే భారతప్రజల సహన శీలమునకు ప్రత్యక్షముగాను, పరోక్షముగాను జాలవరకు గారణమని చెప్పవచ్చును. భారతభూవైశాల్యము, దాని శీతోష్ణములు ప్రత్యక్ష కారణములు. భూతలోపరిదృశ్యములో (Land-scape), శీతోష్ణములలో, జీవసభంగులలో కనుపించు వైవిధ్యమువలననే, మతాతిభేదములను సహించు చిత్తవృత్తి ప్రజలకు బరిపాటియైపోయినది. నూతనాగతు లెందఱు చొఱబడివచ్చినను, నివాసములు కల్పించుకొని, స్వేచ్ఛాను రూపముగా తమ బ్రతుకు దాము బ్రదుకుటకు చాలినంత భూవిభాగము లుండుటచే అసూయాస్పర్ధలకు దావులేకుండ బోయినది. ఇక నిచటి శీతోష్ణస్థితియే ప్రజల కలసత్వ

మును, ఉపేక్షను మప్పినదని చెప్పనగును. ఈ దేశమున కెత్తివచ్చినవారందఱు నింపుమించుగా, మధ్యాసియా స్టెప్పీల (Steppes) యందు కష్టజీవనము భరించినవారు గావున నిచటి సుఖజీవనము వారికిమాత్ర మాలస్యమును, ఉపేక్షను అలవరచకుండునా? తొలుత కొత్తచేసినను క్రమముగా వారి రజఃప్రవృత్తి మందగించిపోయినది. చారిత్రక ఘటనలుగూడ ఉదారమందగమనముతో సాగిపోయినవి. భారత దేశచరిత్రమునకు బట్టిన విచిత్రలక్షణములకుగూడ భూగోళపరిస్థితులే కారణము కాగా, చరిత్రమును, భూగోళ పరిస్థితులును జతయై, భారతీయుల స్వభావవైఖరికి గారణములైనవి. ఈవిధముగా తాలిమియు, తలయొగ్గుటయు భారతీయులకు స్వభావసిద్ధములైనవి. ఐహికవిషయములందు తలపట్లు పట్టుకొన్నను, సంస్కారమూలకమగు ఆముష్మిక విషయములందుమాత్రము సమన్వయమే గోచరించును.

భారత దేశభౌగోళిక పరిస్థితులే భారతీయతాముద్రకు గూడ కారణమైనవి. తీర్చి దిద్దినట్లున్న భారత దేశపు హద్దులు మరియొక దేశమున కుండుట యరిది. దురారోహములగు హిమవత్పర్వత శ్రేణులు భారతమును తక్కిన ఆసియాఖండమునుండి వేరొనర్చ, నిరుదెసల సముద్రపర్యంతము వ్యాపించిన ప్రత్యంత పర్వతపంక్తులు కేల్దోయివలె గాపాడుచున్నవి. తక్కిన దెసల సముద్రమే భారతభూఖండమునకు హద్దులువెట్టి, వెలుపలి దేశములనుండి వేర్పాటును, లోపలి దేశముల గాఢసంశ్లేషము నొక్కరీతిగా సమర్థించుచున్నది. తక్కిన భూమండలమునుండి భారత దేశము నిట్లు

వేర్పఱచిన ప్రకృతియే అచటి ప్రజలు పురుషకారపరులై, సుఖజీవనము సల్పుటకై కావలసిన సాధనసంపదను పుష్కలముగా సమకూర్చిపెట్టినది. ఆసియాఖండమునం దితర భాగములలో ప్రజాసమూహములు వలసలుపోవు దాడులకు దూరమై, పరులకు దుష్ప్రవేశమై, నిజప్రజాకోటులు నివసించుటకు, సంస్కారవంతులగుటకు వలసినంత అవకాశము గల్గి, భారతదేశము శాత్రవపీడ కగ్గముగాక సుఖించుచున్నది. భారతదేశమునకు శత్రువుల దాడులు లేవా యనిన, లేకపోలేదుగాని పురాతనసభ్యతావిషయమున దనకు సాటివియగు ఈజిప్టు, ఇరాను, సిరియా, మెసపొటేమియాలకు శత్రువులచే వాటిల్లిన అగచాటులు దలచి కొన్నచో, భారతదేశము శత్రువుల దాడు లెఱుగక, తన సభ్యతను బ్రోదిచేసికొనుచు, శాంతిసౌఖ్యము లనుభవించిన దనియే చెప్పవచ్చును.

భారతదేశమునకు చారిత్రకమైన ఐక్యముగూడ దాని భౌగోళికలక్షణములవల్లనే సిద్ధించెనని చెప్పినను తప్పులేదు. నైసర్గికస్వరూప (Physical features) మాత్రముచేతనే తక్కిన ఆసియాఖండమునుండి స్పష్టముగా వేఱై కన్పించు భారతభూమిని, హద్దులుదాటించి పెంచుటగాని, విభజించుటగాని ఎవ్వరికిని శక్యముగాకపోయెను. బయటినుండి ఎత్తివచ్చిన ఆర్యులకు అనతికాలములోనే వారి జన్మదేశమునం దున్న స్వజనముతో సంబంధము తీఱిపోయినది. గాంధార మను పేరుమాత్రము నిలిచియున్నదేకాని ఆఫ్గనిస్థానమును భారతభూమితో గలుపవలెనని ఆర్యులు చేసిన యత్నములు

ఫలించనేలేదు. భారతజీవనకక్ష్య (Orbit) నుండి అది యేనాఁడో విడివడిపోయినది. గాంధారము నెట్లైన నిలుపుకోఁగోరిన శకార్యుల యత్నముతోపాటు పాంచాలమును ఆఫ్ఘనిస్థానముతో మేళనము చేయఁగోరిన గ్రీకుల యత్నములును విఫలములే యైనవి. కాబూలు రాజధానిగా భారతభూమి నేలఁగోరిన మహమ్మదు గజినీయు, భారతపుటెల్లల కవ్వలిభూముల నడుపులో నుంచుకోఁగోరిన పఠానుప్రభువులును గృతకృత్యులు కాలేకపోయిరి. మొగలుసామ్రాజ్యమునఁగూడ నిట్టి వైఫల్యమే పునరుక్తమైనది. సింధుదేశము నెన్నిసార్లు వశీకరించినను దానిని పారశీకముతో శాశ్వతముగా గలిపివేయుట సాధ్యముకాలేదు.

బహిఃప్రపంచమునుండి వేరుపడిపోవు ఈ ప్రయత్నము స్పష్టమేకదా! ఇట్లె ఆంతరముగా ఒక్కటిగావలెనను యత్నముగూడ మొదటినుండియు గద్దు. రాచనంగడములెన్నియో భారతము నేకచ్ఛత్రముక్రిందికి గొనితేరనెంచుటయులుండ, రామాయణభారతేతిహాసములందు అశ్వమేధరాజసూయాదిగాథలుగూడ ఈ యత్నమునే చాటిచెప్పుచున్నవి. ఇటీవల నీ ప్రయత్న మొనర్చినవారిలో చంద్రగుప్తుడు ప్రథముడు. అశోకచక్రవర్తి కీవిషయమున సిద్ధించినంత కృతకృత్యత అంతకు బూర్వమందుగాని, పరమందుగాని ఇతరులకు లభింపలేదు. పఠానులు, మొగలులు మున్నగు పాదుషా లెల్లరీయత్న మొనర్చినవారే. స్మృతుల కాలమునుండి నేటివఱకు భారతరాజనీతి కిదియే లక్ష్యము. భౌగోళికముగా భారతభూమికి సిద్ధించిన ఈ ఏకాంతరైక్య

మును భారతదేశచరిత్ర మఱుగడుగున ప్రమాణీకరించు చున్నది.

భౌగోళికమైన ఈ యైక్యమే ఆర్థికైక్యమునకుగూడ దారితీసినది. భూస్వభావ మంతయు నేకమైనపు డచటి ప్రజల యర్థనీతియు నేకమే యగును. భారతభూవిస్తారతయు, దాని సారవత్తయు కాలక్రమమున అవిరతప్రజావృద్ధిని, కృషివృద్ధిని సంపాదించిపెట్టినవి. చాలినంత పంటనేల లేనిచో కృషిపద్ధతులు తీవ్రతరమగుటయు, సారవత్తలో తరతమత్వ మున్నపుడు కృషిపద్ధతులు భిన్నము లగుటయు తటస్థించును. ఈ రెంటివలన కృషిపద్ధతులలో అవిరత నూతనప్రయోగములు, సంఘనిర్మాణములో నూతనజాతులు పొడముచుండును. సంపదుత్పత్తిమార్గము లొకవంక, సంఘములో వేర్వేఱు తెగలకు సంపదుద్పాదకశక్తులతో ఏర్పడు సంబంధము లొకవంక సంఘస్వరూపమును దిద్దుననుట నిర్వివాదము. కాగా, నాలుగైదువేలయేండ్లనుండి భారతదేశములో కర్షకవృత్తియే ఒక్కరీతిగా అర్థనీతిని పోషించుచుండుటవలన చెక్కుచెదరని సాంప్రదాయములు, సంస్కారము ప్రజల కలవడినవి. చిరతరమైన కాలమహిమయే ప్రజాచిత్తవృత్తి నేకముచేయగల్గినది. దేశమంతట నొక్కతీరైన సంఘనిర్మాణముకూడ దానికి పుష్టినిచ్చినది.

వృత్తి యొక్కటియైనచో బ్రజల చిత్తవృత్తియు నొక్కటియే యగును. భారతప్రజకు వ్యవసాయమే ప్రధాన జీవనవృత్తిగావున వారి కందఱికి ఏకస్వభావము, నేక దృష్టియు నలవడినవి. విశ్వ మంతట కర్షకప్రజలో కుల

(Tribal) గోత్ర (Parochial) సంప్రదాయము కన్పించును. వారి కష్టసుఖములకు గ్రామము, గ్రామప్రజాసంఘమే ప్రమాణము. ఇచ్చిపుచ్చుకొనుటలు, కలిపిగోలుతనము వారిలోవారికే కావున స్వక్షేమపరమగు వ్యక్తిత్వమున కచట తావుండదు. అట్లె, తన కులగోత్రముల హద్దులను దాటి, యావత్ప్రజాక్షేమమును పరామర్శించు విశాలదృష్టికి నచట తావు దొరకదు. కావుననే భారతప్రజ లెప్పుడును తమ కులముపట్ల, తమ తెగపట్ల భక్తినెరపుట పొసగనేకాని దేశముపట్ల, యావద్భారత ప్రజపట్ల భక్తినెరపుట దుర్లభమై పోయెను. గ్రామప్రజాసంఘమే కష్టసుఖములకు హద్దగుటచే భారతజాతీయతాదృష్టి లోపించిపోయినది.

కృషి ప్రధానమగు భారతప్రజ కింకొక స్వభావము గూడ నేర్పడినది. ప్రకృతిధర్మములగు కాలమానములకు వశంవదుడై మెలగవలసినవాడేకాని కర్షకుడు అతివృష్ట్యనావృష్టులను, ఈతిబాధలను తప్పించుకొనలేడు. ప్రకృతి నిగ్రహానుగ్రహముల కాతడు తలయొగ్గి బ్రదుకవలసినవాడు గావున దైవమునే నమ్ముకొని, విధివశమున ప్రాప్తించు కష్టసుఖములకు దోసిలియొగ్గి ధీరుడై నిలుచును. వర్తక వాణిజ్యములు చేయువారి కన్ననో, స్వశక్తిప్రత్యయము, సాహసము, పరాక్రమణశీలము వలయును. కావున వర్తక వాణిజ్యములు ప్రధానముగా జీవించు జాతులకు పురుష కారము, ఉత్సాహము, ఆరంభశీలము స్వభావములై పరిణ మించును.

భౌగోళికదృష్ట్యా భారతదేశ మంతయు నేకచ్ఛత్రము

క్రిందికి రాదగియున్నను శాస్త్రీయములగు వస్తూత్పాదన సాధనములు కొఱవడుటయే ఇన్ని రాజకీయవిప్లవములకు గారణము గానోపును. ఇచటి శీతోష్ణవాతాతపాది ప్రకృతి ధర్మములను వశీకరించుట అసాధ్యమగుటచేతనే ఏకరాజ్య స్థాపనము దుర్ఘటమూయెను. కావుననే మొన్న మొన్నటి వఱకు సంస్కారైక్యమేకాని పరిపాలనైక్యము కొఱవడి పోయినది.

ఇప్పుడిప్పుడు శాస్త్రీయసాధనసంపద వృద్ధి చెందు చున్నది. తన్మూలమున దేశవిస్తృతియు, గాలదీర్ఘతయు మటుమాయమగుచున్నవి. కావున రాజకీయైక్యమునకు మార్గము చదునైనది. భారతదేశపు సహజసంపదకు దోడు సిద్ధమై యున్న సంస్కారైక్యముతో పాటు ఏకపరిపాలనము గూడ నమరునేని విశ్వమానవకర్మకలాపమున నది ఆచార్య పీఠమే ఎక్కగలదు.

ఎంతటి దారుణవిపత్తులకైనను ఒక్కించుక సౌఖ్యరేఖ యుండకపోదన్నట్లు భారత రాజకీయవిప ర్యాసములవలనగూడ కొంత కొంత మేలు సమకూరినది. సహనమే భారతీయుల శీలమునకు బ్రధానలక్షణమని చెప్పి యుంటిమి. ఆ సహనముతోపాటు కొన్ని సద్గుణములుగూడ పెనచికొనిపోయినవి. రాజకీయవిపర్యయములు భారతీయ జీవనమును బహుముఖసుందరముగా నొనర్చినవి. మొదటి నుండియు గాలాంతరములందు వచ్చిపడిన విజాతీయులమూల మున భారతరాజ్యాధికారస్వరూపమందును, దాని పంపక మందును మాటిమాటికి మార్పులు జరుగుచు వచ్చెను.

దేశము చిన్నవియు, పెద్దవియు నగు ననేకరాజ్యములుగా విడిపోయెను. చిన్నచిన్న రాజ్యము లనేకము లిట్టుల నేర్పడి తదధికారము తఱచు మాఱుచుండుటవలన ప్రజల అసహాన మును, దురాక్రమణశీలమును సన్నగిలుట సంభవించెను. క్రమముగా విజాతీయులపట్ల సహానమును, సుముఖత్వమును ప్రబలినవి.

శాత్రవుల ధాటి కెన్నిమారు లగ్గమైనను, రాజవంశ ములు మాటిమాటికి మార్పుజెందుచున్నను, ప్రజాజీవనము మాత్ర మవిరతక్రమవికాసము జెందుచునేయుండెను. తమ రాకకు బూర్వమే మొహెంజోదారోలో నెలకొన్న సభ్యత నార్యులు చెరపివేయక తమ సంస్కృతికి దానినే పునాదిగా నంగీకరించిరి. ఆ రెండు సంస్కృతులు నట్లు సమ్మేళనము జెందుటవలననే నేటి పరిశోధకులు గొందఱా రెండును భిన్నముగావని యెంచి బూర్వార్యసభ్యతను శంకించు చున్నారు. ఆర్యులు మొదటినుండియు నిచ్చటివారేకాని, ఎత్తివచ్చినవారు గారనియుఁ, మొహెంజోదారోసభ్యత వారి తొలినాటిదనియు ఆ పరిశోధకుల మతము. ఆర్యపూర్వార్య జాతులకు గల సామ్యముమాట యెట్లులున్నను భారతజీవన సంస్కృతుల భిన్నదశలలో మొహెంజోదారోలక్షణములు గన్పించుచుండుటమాత్రము నిర్వివాదము. నేటి హైందవ మతమునందలి శివశక్త్యారాధనము మొహెంజోదారో నాటిదే. ఆసీనబుద్ధవిగ్రహములకు మాతృక లచట దొరకిన ముద్రికలపై గన్పించుచున్నవి.

రాచరికపు దగవులాటలవలన బలు తెగలవారును,

ఉత్తమాధమసంస్కారులు నొక్కచో జేరుట తటస్థించుచు వచ్చెను. తత్త్వజ్ఞానము నానాటికి వికసించుచునుగాని ఒక్క నాటితో అంతముగాదని భారతీయు లానాడే యెఱిగియుండిరి గావున అధికారి తారతమ్యములనుబట్టి ఎన్నెన్నో మతిభేద ములను వా రంగీకరించిరి. కావుననే పామరులు సల్పు బహుదేవతారాధన మొకవంక, తత్త్వవేత్తల ఏకేశ్వరో పాసన మొకవంక వెలయుచుండెను. ఈ జాతిమతభేదములను, అధికారిభేదములను గడుపులో బెట్టుకొనుటవలననే హైందవ ధర్మము నానాత్వశోభితమయ్యెను.

భౌగోళికదృష్ట్యా ఏకచ్ఛత్రితము గాదగియున్నను శాస్త్రీయజ్ఞానలోప మందులకు భంజకమైనదని చెప్పితిమి. అప్పటప్పట బొడముచువచ్చిన సామ్రాజ్యములు అనుకూల సందర్భలోపముచే జిరకాలము నిలిచినవి కావు. అధినివేశ కరణమునకై (Colonisation), సామ్రాజ్యస్థాపనకై జరిగిన ఆనాటి యారంభములు ఈనాడు స్మృతిముకురమున మన మనకనీడ లీనుచున్నవి. చరిత్రాంకితములుగాని ఆనాటి కథలు, గాథలు స్మృతిపథమున నిలిచి భారతసంజాతుల నేకసూత్రితుల నొనర్చుచున్నవి. ఆ యేకతాప్రాబల్యమును వైదేశికులుగూడ తప్పించుకొనలేకపోయిరి. రాజపుత్రజాతి పరదేశములనుండి యెత్తివచ్చినదైనను ఇచటి ప్రజలో లీనమైపోయెను. లీనమగుటయేకాదు; హైందవధర్మరక్షకు లని వారు పొగడ్తకుగూడ నెక్కిరి. వారి యానుపానులు విస్మృతములై పోయినవి. మసల్మానులుగూడ నట్లే భారత జీవనస్రవంతిలో గలియకతీరదయ్యెను. వారి వృత్తాంతము

ముందుముందు సాకల్యముగా వివరింతును. కాగా, ఐరోపీయులుమాత్రము భారతప్రజతో గలసిపోక, తమ ప్రత్యేకతను రక్షించుకొనగల్గిరి. కావుననే భారతప్రజకు వారిపట్ల ఆత్మీయతగాని, ఆదరముగాని జనింపక, తడవులవెంట వచ్చి పోవు పక్షులుగానే ఉండిపోయిరి.

# 3

# సంఘనీతి రాజనీతుల పుటపాకము

మన దేశమున ఏకసభ్యతను, ఏకసంస్కృతిని సాధించిన తొంటిపెద్దలు ఏకరాజ్యమును సాధింపలేకపోయిరని చెప్పితిమి. రాచవంగడములు, రాజ్యములు నంతరించిపోవుచున్నను, సంస్కారైక్యముకొఱకై పుట్టిపెరిగిన నాటి రాజకీయసంస్థలును, ఆర్థికవ్యవస్థలును నేటికిని నిలిచియున్నవి. మూడువేల యేండ్లనాటివగు గ్రామప్రజాప్రభుత్వములు నేటికి నెట్లో జీవించియే యున్నవి.

వేదములయందు, నుపనిషత్తులయందు గ్రామసంఘముల ప్రస్తావము గలదు. ఆ సంఘము లన్నియు ప్రజాభిమతమును పాలించు ప్రజాస్వామికసంస్థలే. ప్రజలే రాజులను వరించుచుండిరి. కొందఱు రాజుల కుద్వాసము చెప్పుచుండిరి. అట్లుద్వాసితులైన రాజులను తిరిగి ప్రజలే ప్రతిష్ఠించుచుండిరి. కాలక్రమమున సామ్రాజ్యము లుద్భవించి, బలపడజొచ్చిన కొలది ప్రజాసంస్థలు దుర్బలములయ్యెను. కాని, అనిర్దిష్టములు, విస్తృతములగు నధికారములతో నేటికిని గన్పించు

చున్న గ్రామపంచాయతులే ఆనాటి ప్రజాస్వామ్యసంప్రదాయము పూర్తిగా లోపించనందుకు సాక్షులు.

తొలినాళ్ళలో కొన్ని గ్రామములు కూడలియై పరిపాలకసమితులను వరించుకొనుచుండెడివి. ఆ సమితులలో సభ్యులందఱు నొక రాచకార్యములనే కాదు, సాంఘిక, ధార్మికవ్యవహారములనుగూడ బహిరంగముగా జర్చించి, కూడబలికికొని, నిశ్చయ మొనర్చుచుండిరి. బౌద్ధమతములు గూడ ప్రజాస్వామ్యసంస్థలే. మౌర్యసామ్రాజ్యము నెలకొన్న మీదటఁగూడ ఈ ప్రజాసమితులకు భంగము వాటిల్లలేదని కన్పించుచున్నది. అశోకునిది నేటి సామ్రాజ్యముల వంటిది కాదు. భారతభూమియంతట నించుమించుగా నాతని శాసనము చెల్లుబడియైనను, ఒక్క కళింగమును (Orissa) దక్క ఇతరము నాతడు జయించలేదు. దక్షిణాపథమందలి స్వతంత్రరాజ్యములు సామవశీకృతములుమాత్రమే. అవి బుద్ధిపూర్వకముగానే అశోకుని చక్రవర్తిత్వము నామోదించినవి. బిందుసారుని సామ్రాజ్యము నేటి హైదరాబాదును దాటి, దక్షిణాపథమున కాలుపెట్టనే లేదనుటకు ఆధారములు కన్పించుచున్నవి.

కర్షకవృత్తిప్రధానములు, స్వయంభరణములు (Autonomous) నగు గ్రామములు పరులజోలి లేక స్వతంత్రములై యుండును. కావుననే భారతభూమిలో 'పుబ్బామఖా' న్యాయముగా సామ్రాజ్యములు పొడమి, యడగిపోయినవేకాని గ్రామప్రభుత్వము లట్లే యున్నవి. ప్రజాబాహుళ్యమునకు నేటికిని వ్యవసాయమే ప్రధానవృత్తి

యగుటయే ఇందులకు గారణము. భారతీయసాంఘిక సాంప్రదాయములలో ఈనాటికిని శేషించియున్నది స్వయం భరణమగు నీ గ్రామపంచాయతి యొక్కటియే.

ఈ కర్షకవృత్తిప్రధానత శాశ్వతముగా నిలిచియుండ జాలదు. అర్థవ్యవస్థ మార్పుచెందక తప్పదు. వ్యాపార వాణిజ్యములు క్రమముగా దలయెత్తజొచ్చెను. శ్రమవిభాగ (Division of labour) మేర్పడి, వర్ణవ్యవస్థకు దారితీసెను. చాతుర్వర్ణ్యము గడ్డకట్టుకొనెను. వర్తకవాణిజ్య విస్తృతితో పాటు గ్రామపరిమితములైన స్వతంత్రార్థిక వ్యవస్థలుగూడ చిన్న చిన్న రాజ్యములుగా విస్తరించెను. సామ్రాజ్యము లనునవి ఈమార్పుచే గలిగిన రాజకీయలాంఛనములే. రాచకార్యములు గ్రామముల హద్దులు దాటగనే బహు ముఖములయ్యెను. పరిపాలనాసౌకర్యముకొఱకు, సమత్వము కొఱకు రాజ్యాధికారము కేంద్రీకృతమయ్యెను. స్థానిక కేంద్రాధికారముల వేర్పాటు ప్రబలజొచ్చినది. గ్రామపంచా యతుల అధికారములు, విధులు చాలవఱకు వానిచేతులనుండి జారిపోయినవి. కాని వ్యవసాయమే నేటికిని ప్రధానపరిశ్రమ యగుటచే గ్రామస్వపరిపాలనముమాత్రము నిలిచియున్నది. స్థానికవ్యవహారములను నేటికిని పంచాయతులే చక్కబెట్టు చున్నవి. తగవులు దిద్దుచున్నవి. ప్రభుత్వానుమతి యున్నను, లేకున్నను పెక్కుశాసనములు తామే నిర్మించుకొనుచున్నవి. ధార్మిక, సాంఘిక వ్యవహారములలో పంచాయతులు నెరవు చెల్లుబడి, సొంతవము ప్రభుత్వము లేనాడును నెరపజాలవు. ఈ మర్యాద హైందవప్రాబల్య మున్న దక్షిణాపథమందే

కాదు, ఉత్తరభారతమునను, ముస్లిముప్రాబల్య మున్న ప్రదేశములలోను జెల్లుచునేయున్నది.

రాచకార్యములలోను, ఆర్థికవ్యవహారములలోను గ్రామములందు ఈ యవిచ్ఛిన్నమర్యాద కొనసాగినందుకు సంతోషమే కాని సాంఘికాచారములపట్ల మాత్ర మది అవాంఛనీయమగు పరిణామమును సంఘటించి పెట్టెను. చెక్కుచెదరని ఆర్థికమర్యాదలు సంపద్వృద్ధికి భంజకము లగుటయే కాక, క్రొత్తమార్పులపట్ల వైముఖ్యమునుగూడ పెంపొందించినవి. ప్రపంచమంతటగూడ కృషిజీవనముచేయు సంఘము లిట్లే ఆచారసాంప్రదాయబద్ధములై, సంకుచిత దృష్టితో వ్యవహరించును. వ్యాపారవాణిజ్యము లవలంబించినవారికి సరకు త్వరగా విడుదలకావలెను; క్రొత్తసరకు రావలెను. కావున వారు నూతనభావవ్యాప్తికి, క్రొత్త మార్పులకు సుముఖులై యుందురు. మన పల్లెలలో వ్యవసాయవృత్తియు, గ్రామసంఘములు నేకీభవించి, గ్రామీణులకు క్రొత్త రోతయనిపించు ఆచారబద్ధతను, జడత్వమును అలవఱచినవి. అందువలననే దృఢతరమైన ఏక జాతీయతాభావము మనకు లోపించి, రాచకార్యములందు కలసికట్టుగా వ్యవహరించు శక్తియు గొఱవడినది. గాఢమైన సంస్కారైక్య ముండియు, రాజకీయముగా ఏకార్థ సమవేతత్వము లేని యీ వైపరీత్యము మన నొసటనే పొడిచినది.

భారతీయసంస్కృతి సబలము, దుర్బలముగూడ ననుటకు దాని వర్ణవ్యవస్థయే సాక్షి. భారతప్రజాజీవనైక్యమును

భగ్నముచేయుటేకాక ప్రజాస్వామికత్వపరిణతికిగూడ నీ వర్ణవ్యవస్థయే అడ్డమువచ్చినది. అగ్రవర్ణులకు దురహంకృతియు, అధమవర్ణులకు నైచ్యము ననుసంధించినది. మానవు లందఱిలోను సజాతీయభావము నిది వికసింపనిచ్చినది గాదు. వర్ణవ్యవస్థనుగూర్చి ఇట్టి యాక్షేపము లెన్నియున్నను సహనశీలమును, పారంపర్యమును బోషించుటకే యిది యుద్దిష్టమైనదని అంగీకరింపక తీరదు.

వర్ణవ్యవస్థచే సహనము పెంపొందుననుట స్థూలదృష్టికి విపరీతముగా దోచునేమోకాని ఇచటికి దాడివెడలిన వివిధజాతుల కలహములకు, జయాపజయములకు ఈ దేశము రంగస్థల మైనదనియు, పుట్టుకచే, భాషచే, వర్ణముచే, మతాచారాములచే భిన్నులగు నిన్ని జాతులవారిని సమన్వయముచేయు ఏకసాంఘిక రాజకీయవ్యవస్థ ఉత్పన్న మగుట దుస్సాధమనియు మనము విస్మరింపరాదు. అమెరికా, ఆస్ట్రేలియా, ఆఫ్రికాఖండములకు 18,19 శతాబ్దులలో వలసలుపోయిన ఐరోపీయులకుగూడ నిట్టి సంకటమే ఎదురయ్యెను. ఆ ఖండములందు నివసించు ప్రజ లేకజాతీయులు. వారికి, దమకు గల వైరుధ్యమును మాత్రమే ఏరోపీయులు పరిహరింపవలసినవారైరి. మఱి యీ దేశమున కెత్తివచ్చిన ఆర్యుల కట్లు గాదు. ఇచట నానాజాతులను, నానాసభ్యతాసంస్కారభిన్నావస్థలను వారు సమన్వయపఱచవలసివచ్చెను. ఈచిక్కు నీయుభయులు నెట్లు విప్పిరో చూతము.

అమెరికాలోను, ఆస్ట్రేలియాలోను ఎదురైనవారిని సమూలనాశన మొనర్చియు, ఆఫ్రికాలో ఎదురైనవారిని

శాసనసలనొనర్చియు ఐరోపీయు లీపీడ వదల్చికొనిరి. ఇక ఆర్యులన్ననో, వర్ణవ్యవస్థచే నీవైరుధ్యమును బరిహరించిరి. ఆయా జాతులయందు జన్మించుటతప్ప ఇతరాపరాధ మెఱుగని కోట్లకొలది ప్రజలను శాశ్వతముగా నధమవర్ణు లని నైచ్యమునకు బాల్పఱచుట కేవల న్యాయ్యదృష్ట్యా సమర్థింపజాలముగాని, చారిత్రకదృష్ట్యా విచారించితిమేని నానా జాతులను ఏకసంఘముగా సంఘటనచేసి, సభ్యతలలోని తారతమ్యముల నొక్కసంస్కారసూత్రమున గ్రుచ్చిన వర్ణవ్యవస్థ కేవల నింద్యము గాదనియు, స్తుతికిగూడ నర్హమనియు నంగీకరింతుము.

భిన్నజాతులు, నానావ్యక్తులు ఒక్కచో బొందిపొసగి మనుటకొఱ కీవ్యవస్థ కల్పితమైనది. వంచుటకు, జక్కబఱచుటకు ననువైన ఈ వ్యవస్థ ప్రజకు సమ్మతమయ్యెను. ఈ వ్యవస్థ ఆదియందు జన్మచేగాక గుణకర్మలచే నిర్మితమగుటచే ఒకవర్ణమువారింకొకవర్ణములోనికి మారుచుండిరి. ఆర్యదేవగణములో ద్రావిడదేవతలకు గూడ చోటిచ్చుటే కాక ద్రావిడ పురోహితులనుగూడ బ్రాహ్మణ్యమున జేర్చుటయే ఇందుకు తార్కాణ. వర్ణమును మార్చుకొనుట కిట్లు వీలుండటవలన ఆర్యద్రావిడ భేదములు సన్నగిల్లి, ఉభయులకు దృఢానుబంధ మేర్పడెను. నేటి యూరోపులో పరస్పర కలహకారణములైన ఆర్థికవ్యత్యాసము లిచట గలుగకుండ ఈ వర్ణవ్యవస్థయే పరిహరించెను. వ్యవసాయమే ప్రధానవృత్తిగావున ప్రజలలో వర్గవ్యత్యయము లానాడిచట తలచూపలేదు. ప్రకృతిశక్తులు వశీకరింపరాని వగుట

కూడ నందుకు తోడ్పడెను. ఎటు వంచిన నటు వంగు వర్ణ వ్యవస్థయే ఈ కలహములని చట బొడమనీయ లేదని చెప్ప వచ్చును. ఎల్లి సుఖము గల్గు నను నాశచే నేడు కష్టములు సహించుట మానవస్వభావము. వర్ణవ్యవస్థ అట్టి ఇహపర సౌఖ్యములపై ఆశ కల్పించినది. క్రమముగా వ్యవహార మందు వర్ణవ్యవస్థ వంచరాక, బిగిసిపోవుటచే నే డది సమర్థ నీయము గాకుండబోయినది.

భారతీయ సంస్కారసాంతత్యమును, ఏకత్వమును ఇచటి నానాభాషలు గూడ తెల్లమొనర్చుచున్నవి. మన భాషల నైవిధ్యమును రాజకీయ కారణములచే కొండంతలు చేసి నేడు ఆక్షేపించువారుగూడ ఆ భాషల నిర్మాణ స్వభావములందున్న సామ్యమును గాదనలేరు. ఆర్యద్రావి డము లగు భిన్నమాతృకలనుండి ఈభాషలు జనించినమాట నిజమేకాని, వర్ణములకువలె ఈ భాషలకుగూడ వ్యవస్థ కల్పించి, వాని వాని స్వభావానురూపముగా వృద్ధిజెంద నిచ్చిరి. సంస్కృతము మాత్రము అంతకు బూర్వమున్న భాషను సంస్కరించుటచే నేర్పడినదని దాని పేరే చెప్పు చున్నను తక్కిన భాషల కెల్ల శబ్దసమామ్నాయముననుు, స్వభావముననను అదియే చాలవఱకు భిక్ష పెట్టినమాట నిజము.

ఇతరభాష లన్నిటికి సంస్కృతముతో గల ఈ సామ్య మును బరికించిన విద్వాంసులు కొంద రా భాష లన్నియు సంస్కృతభాషా వికృతులే యని తలచుటగూడ సంభవించు చున్నది. ఆర్యు లీ దేశమునకు వచ్చునాటికే సంపన్నముగా నుండిన ద్రావిడభాషకు గూడ సంస్కృత మాతృకత్వము

తప్పినదిగాదు. కాలము గడచినకొలఁది క్రొత్తప్రజలతో క్రొత్తభాష లవతరించుచున్నను, సంస్కృత ప్రాధాన్యము బలీయమైనదేకాని దానిపట్టు సడల్పలేకపోయినవి. కావున భారతభాష లన్నిటికి శబ్దసామ్యమే కాక వ్యాకృతియందును సామ్యము కద్దు. ఈ భాష లన్నిటియందును ఒకే చిత్తవృత్తిగూడ స్పష్టముగా గన్పించుచున్నది. ద్రావిడుల పూర్వకావ్యములం దార్యులపట్ల ద్వేషమును, ఆర్యుల ఆదికావ్యములందు తత్పూర్వులయెడలను, ద్రావిడులయెడలను భీతిద్వేషములును ప్రకటముగా నున్నవి. కాని ఈ ద్వేషభావమును, విరోధము నచిరకాలముననే అంతరించినవి. భిన్నజాతుల నేకసూత్రమున గ్రుచ్చిన సమానసంస్కారములు భారత సాహిత్యములందును బ్రకటితములై పరస్పర ద్వేషములను సంశోధితము లొనర్చినవి.

## 4

## కథకులు

ఆర్యులు దక్షిణాపథమును, ఈశాన్యభారతమును ఆయుధబలముచే గాదు, ప్రధానముగా సంస్కారబలము చేతనే జయించిరి. ద్రావిడులు తమ ప్రాచీనసభ్యతను, ఆర్యులు ద్రావిడసభ్యతపట్ల దమ యవిశ్వాసమును మఱచి ఉభయజాతులును ఓకేమై, నొక్కటిగా కరగిపోయెను. ఇట్లు సమ్మిశ్రితమైన నూతనసభ్యతయం దుభయులకు నాత్మీయతయు, ఐక్యమును లభించినవి. రామాయణ భారతముల యందు పూర్వద్వేషము ధ్వనించి, స్మరణకు వచ్చుచున్నను,

ఒకరిమంచి నొకరు గ్రహించి, ఆదరించుటయు గన్పించును. ఈ యుభయజాతిసమన్వయమునకు రామాయణముకంటె భారతమే పోషకమైనది. బౌద్ధగాథలును, ఇతర సంస్కారోద్యమములును ఆ సమన్వయమును బెంచి పోషించినవి.

ఆసేతుహిమాచలమైన భారతభూమియందు స్థానికముగా నెన్ని మతభేదములున్నను, కర్షక ప్రజాచిత్తవృత్తులు, స్వభావము నొక్కటిగా నుండును. భారతకర్షకుల తత్త్వజ్ఞతయు, కష్టసహిష్ణుతయు గాంచి, యచ్చెరువందువారి కది నిస్పృహయో, విధివిధేయతయో యనిపించుచుండును. రజోగుణము కొఱవడినపుడు అదృష్టమగు దైవమునకు జేతులొగ్గుట యలవడుట నిజమే కాని, మెట్టవేదాంతమునకు, ఆత్మవంచనకు గూడ హద్దుగలదు. కడుపు గాలుచున్నపుడు తత్త్వవిచారణ పొట్టనింపదుగదా! భారతదేశ కర్షకుడల్ప సంతుష్టుడు. పొట్టకై త్రిప్పలు పడనక్కరలేక, కడుపునిండిన నాళ్లలో గూడ నాతడు విధివిలాసమును గూర్చి విచారణలు సల్పుట మానడు. ఒకవేళ శీతోష్ణస్థితి ఇందులకు గొంత కారణమేమో? ఆ యీ కారణకలాప మెట్లున్నను భారత కర్షకుని తత్త్వజ్ఞతయు, వైరాగ్యమును, దైవచింతనమును పైపై మెరుగులుమాత్రము కావు. నూతనులగు వైదేశికులీ చిత్తవృత్తిగాంచి, ఆశ్చర్యమగ్నులగుచుందురు. నేటికిని అక్షరజ్ఞానశూన్యమగు నీ పామరకర్షక జనమున కింతటి వైరాగ్యమును, శాంతిదాంతులు నెట్లబ్బినవో! చదువు సంధ్యలు లేని ఈ సంస్కారమెక్కడిది?

అదుగో! గ్రామగ్రామమును దిరిగి భిక్షాటనము



గ్రామ కథకుని సద్దులు వినుచున్న ప్రయాణీకులు, లేక యాత్రికులు

సల్పుచు, ప్రజలకు కథలు, గాథలు వినిపించి, వైరాగ్యమును, శీలమును, ధర్మాధర్మములను బోధించు ఆ భిక్షుకుని, కథకుని, గాయకుని గాంచుడు. ఆతడే పామరజనమున కీ జ్ఞానభిక్ష పెట్టుచున్నాడు. తత్త్వమును మానవేతిహాసములతో మెదిపి కథలుగా వినిపించుచున్నాడు. పురాణములు చెప్పి, ధర్మాధర్మములు బోధించుచున్నాడు. పరంపరాగతమగు జ్ఞానధనమును పల్లెల కాతడు పంచియిచ్చినాడు.

ఏడీ ? మన తాతలనాటిచుట్టమగు కథకు డేమైనాడో! వీరగాథలను, గల్యాణములను బాడుకొనుచువచ్చు నాభిక్షుకు డిపుడు మన పల్లెప్రాంతములందు గన్పించుటలేదు. మన రచ్చపట్టులలో, రామభజనాలయములలో భారత రామాయణ కథలు చెప్పు పౌరాణికుడు, హరికథకుడుగూడ నదృశ్యులైపోయిరి. వారి పీఠములు శూన్యములై నిలిచియున్నవి. స్థలపురాణములను, వీరచరితలను గాపాడుచువచ్చిన ఆ గాయక కథకుల ఋణ మెట్లు తీర్చుకొందుము ? ఎచ్చటనే విశేషములు పొడమినను వానిని కథలు, యక్షగానములు చేసి, వినిపించి శాశ్వత మొనర్చిన కథకుడా! నీకు గళ్యాణమగుగాక !

నిన్ను గోల్పోయిన మే మేమి తెచ్చుకొంటిమి? నీ వెనువెంటనే వచ్చిన తోలుబొమ్మలాటలు, వీధిభాగవతములు గూడ నంతరించి, నాటకశాలలు, సినిమాలు మాకు లభించినవి. ఈ నాటకములు, సినిమాలు నగరవాసులగు భాగ్యవంతుల వినోదములు. ఎచటనైన పల్లెబస్తీలలో నొక సినిమాప్రదర్శనశాల వెలసినంతనే, ఈ కరువుకాలములో

బత్తెములు గట్టుకొనిపోయి కూర్చున్న మాకా వెండితెరపై ప్రత్యక్షమగునది యేమి? నాగరభోగ దేవతా విలాసములును, క్షుద్రవినోదములును, మతద్వేషమును బెంచు వీర రసాభాసలు - నివియేకదా! అతీతవృత్తాంతములను, వీరకథలను కన్నులకు గట్టునట్లు వర్ణించి చెప్పుచు గగుర్పాటును, మనశ్శాంతిని గూర్చు నీ కథనములేడ, ఈ సినిమా తళతళ లేడ! సత్యమునకు, ధర్మమునకు బట్టముగట్టి, మంగళాంతములగు నీ కథలకు మేమింక నోచుకొనము గాబోలు.

కథకుడా! నీవు సాంఘికసంస్థ వవుదువే కాని వ్యక్తి మాత్రుడవు గావు. నీవు లేని మా గ్రామజీవనములు నిస్సారములు. నీవు కవివి, కథకుడవు, గాయకుడవు, ఉపదేష్టవు, బాంధవుడవు. మా పల్లెజీవనము నీయందు మూర్తీభవించి, చైతన్యము దాల్చెను. నీవి కేవలకథాకాలక్షేపములు గావు; మా కష్టసుఖములు, రాచకార్యములు, కాలమాన విశేషములు జెప్పికొను ఇష్టకథాగోష్ఠులు, దుష్టశిక్షణము సల్పు ధర్మాసనములు.

నీవు మాతోటిపాటువాడవు, మాలో నొక్కడవు, భావనాపక్షములపై ఎగురునపుడుగూడ మమ్మును, మా యంతరమును నీ వెన్నడు మఱచిపోలేదు. మాకు బరిచితములగు నుపమానములతో, లోకోక్తులతో, బిట్టకథలతో నీవు వీరకథాగానము సల్పునపుడు మా హృదయము లుప్పొంగిపోయి, పారవశ్యము ననుభవించెడివి. నిది ప్రత్యక్షశైలి.

హైందవమతమన్న దో నది కేవలతపశ్చరణమే కాదు; వ్యవహారజగత్తును విస్మరించు భక్తిరసావేశమే కాదు;

ఎన్నియో నోములు, వ్రతములు, నిత్యారాధనలు, ధర్మ కార్యములు - నివి యెల్ల నందులోనివే. ఆహారనిద్రాదుల వలె హైందవప్రజ కివి నిత్యకృత్యములు. కథకు డీ ధర్మ బుద్ధిని, భక్తిభావమును అవలంబించి కథ లల్లెడివాడు. ఆతడు వీరకథలు గానముసేయునపుడు పరంపరాగతములగు నుపాఖ్యానములు సెప్పుచు నీతిని, ధర్మమును బోధించెడి వాడు. అంతటి పరమబంధు డిక మనకు దొరకడు.

## 5

## మతము, ధర్మము

వివిధమతములను గ్రుచ్చియెత్తుటచే భారతీయ ధర్మ ములు దిగ్భ్రమకలిగించునట్లు కన్పించునుగాని వీనియందు గూడ ఏకత్వమును, సాంతత్యమును మన పెద్దలు కల్పించిరి. భూతపంచకముల నారాధించుచు వానికి రూపకల్పనముచేసి, సూక్తములందు వానిని గీర్తించిన ఆర్యులు, భారతదేశ మున నివాసమేర్పరచుకొన్న పిమ్మట, వారి వైదికదేవత లతోపాటు క్రొత్తదేవతల నంగీకరించిరి. వేదములలో శివ విష్ణుప్రస్తావ మంతగా లేకున్నను బ్రహ్మతోగూడ వారిరు వురు ముగ్గురు మూర్తులైరి. క్రమముగా బ్రహ్మకుబదులు శక్తి వెలసినది. ఈ స్త్రీదేవతకు వేదములం దెచ్చటను మాతృక కన్పించదు.

త్రిశూలధారియగు శివుని మొహెంజోదారోనుండి ఆర్యులు గ్రహించియుందురు. శివుని లింగస్వరూపముగూడ

అనార్యమేయని తోచుచున్నది. వేదములయందలి రుద్రునకు ఆర్యపూర్వు లారాధించు శివస్వరూపము నారోపింపగా నేటి శివారాధనము పుట్టెనని తజ్ఞు లూహించుచున్నారు. దక్షాధ్వరకథగూడ నీ యూహను బోషకమనియు, ఆ యజ్ఞమునాటికి శివారాధన మంగీకృతము కాలేదనియు వారు వచింతురు. నీలనీరదవర్ణుడగు విష్ణువుగూడ అనార్యదేవుడే కావచ్చును. ఆర్యు లిచటి ప్రజలారాధించుచున్న విష్ణుని దాముగూడ బూజింప నంగీకరించి, వారిని సమాధానపరచిరేమో. పాడిపంటల కధిదేవతయై, వసంతకాలమున బూజలందికొను శక్తినిగూడ ఆర్యు లిట్లే కాలక్రమమున దైవతపీఠమున నెలకొల్పిరి.

అనార్యములగు ద్రావిడాదిదైవతముల నొకవంక నంగీకరించిన ఆర్యులు, వారి పూజావిధానముల నింకొకవంక మార్చివైచిరి. ఆ మార్పుల కందరు సమ్మతించిరి. శత్రువుల దేవతలను దాముగూడ బూజింప నంగీకరించినదొక్క యార్యులే కాదు. దేశాంతరములందుగూడ నిట్టివి కద్దు. ఐనను, ఆర్యు లంగీకరించినంతగా ఇతర దేవతలను మఱి యెవ్వరు నంగీకరింపలేదు. భారతదేశపు భూగోళధర్మమును, భారతదేశచరిత్రమును ఇంతటి సహనమునకు గారణముగానోపును. ఏకమును, అఖండమునైన తత్త్వము అధికారితారతమ్యములనుబట్టి బహువిధముల బ్రత్యక్షమగుననియు, ద్రష్టలలో అధికారభేదముతక్క పరమసత్యమున భేద ముండదనియు, గావున మతము లన్నియు మాన్యములే యనియు ఆర్యు లేనాడో అంగీకరించిరి.

ఈవిధముగా నార్యులు సగుణనిర్గుణములను, కర్మ జ్ఞానములనుగూడ నంగీకరించి, ధర్మైక్యమును నెలకొల్పిరి. వేదములందలి ఆధ్యాత్మికానుభవములను బరిశీలించినచో నార్యులకు దొలినాళ్లలో సగుణముపట్లను, యజ్ఞములపట్లను అంతగా నాదర మున్నట్లు కన్పించదు. పాంచభౌతికమైన సృష్టియందు ఈశ్వరవిభూతిని వారు దర్శించుచుండిరి. వారీదేశమున కెత్తివచ్చు నాటికి వర్ణవిభాగ మెఱుగరనియు, ఇచటనే యజ్ఞాదికర్మలును, యాజకవర్ణము నుద్భవించె ననియు జరిత్రకారులు నమ్ముచున్నారు. ఋగ్వేదమునాటికి బ్రాహ్మణవర్ణవిభాగమును, గర్మకాండయు బ్రబలిపోయినవి. క్రమముగా కర్మకాండకే ప్రాధాన్యము లభించి, మతధర్మాదుల మూలతత్త్వము వెనుకబడినది.

వేదములను నాల్గుగా విభజించుటగూడ నీ కర్మప్రాబల్యమునే సూచించుచున్నది. శ్రమవిభాగము (Division of labour) వలన మతధర్మములు నిస్సారములగుటయు, వర్ణములు బిగిసిపోవుటయు దటస్థించినది. మతధర్మము లొక్క వర్ణమునకే వృత్తియై, జీవనాధారములై పోయినవి. ఇతరులు దిన్నచో మన కాకలి తీరనట్లె ఒరుల ధర్మాచరణము వలన మన యాత్మకు శాంతియు లభింపనేరదు. శుష్కములగు కర్మకలాపములును, పూజావిధానములును భావుకహృదయములకు దృప్తినిడజాలవు. కావున సంస్కారేచ్ఛ ప్రబలినది. తత్ఫలముగా బౌద్ధమత మావిర్భవించినది. బౌద్ధమతము కర్మకాండను చప్పగా దుడిచిపెట్టి, ఆత్మసంయమమునకు, నీతివర్తనకు బ్రాధాన్యము గల్పించినది.

కేవలబుద్ధిగమ్యమగు బౌద్ధధర్మము సామాన్యమాన వులకు దురవగాహము కాగా బౌద్ధమతమందే నూతన కర్మ కాండ దలయెత్తినది. కర్మకాండపై ధ్వజమెత్తిన బౌద్ధ మతము తొల్లింటికంటెగూడ శుష్కమగు కర్మకలాపమున బడిపోయినది. బౌద్ధుల క్షణికవిజ్ఞానవాదము తప్పుదారుల బడి, సర్వమును క్షణికము, ననిత్యముగావున మన కర్మ లును, తత్ఫలములునుగూడ క్షణికములే యను వాదము బయలుదేరినది. జగత్తే మిథ్యయైనపుడిక నీతివినీతులతో బని యేమున్నది? సంఘమున నంతట అవినీతి ప్రబలిపోయి నది. ఈ జగన్మిథ్యావాదమువలననే వైరాగ్యము గూడ ముదిరిపోయి, భారతరాజకీయవిపర్యాసములకు గారణము గానోపు. భారతీయుల స్వభావమున పరమునుగూర్చిన చింతయు, ఇహమునుగూర్చిన యౌదాసీన్యము నీవిధముగా వచ్చిపడినవేకాని ఆదియందు లేవు. ఈ యైహికనిరపేక్షయు, వైరాగ్యము నాదినుండియే యున్నచో భాగ్యభోగములతో దులదూగిన సామ్రాజ్యముల నెట్లు నిర్మింపగలరు? ద్వీపాం తరములందు సంపన్నములగు అధినివేశముల నెట్లు నెలకొల్ప గలరు?

సగుణనిర్గుణములకు, కర్మజ్ఞానములకు సమప్రాధా న్యము కల్పించుట యటులుండ భారతధర్మసమన్వయమున నింకొక విశేషముగూడ గలదు. ఆశ్రమచతుష్టయ మను జీవనవిభాగ మిచటదక్క మఱొక్కయెడ గన్పింపదు. దేహ మునకు నాత్మకు, ఐహికమునకు నాముష్మికమునకు నిది చక్కని సమన్వయము. బ్రహ్మచర్యమున జ్ఞానసముపార్జ

నము, గార్హస్థ్యమున నైహికసౌఖ్యానుభవము, వానప్రస్థమున వైరాగ్యసాధనము, సన్యాసమున మోక్షము నను నీ నాలు గాశ్రమధర్మములు నందఱకి విధింపబడినవి. మానవుని సర్వకామములకు, సకలకర్మములకు నిందు చోటున్నది. స్వసుఖపూర్తి, పరశ్రేయోభిరతిగూడ నిందు సాధనములుగా నిరూపితమైనవి. కేవలాముష్మికమునకు, ఆధ్యాత్మికమునకే కాక ఇహసౌఖ్యములకుగూడ ప్రాధాన్య మిందున్నది. ఈ యాశ్రమచతుష్టయముచే మానవుడు ధర్మార్థకామమోక్షములను సాధించవలెనని చెప్పుటచే పురుషార్థము లన్నిటికి గతి కల్పించినట్లైనది. భారతీయధర్మమూల మింత దృఢమును, విశాలము నగుటచేతనే దాని కింతటి చైతన్య మబ్బినది. ప్రతికూలములగు విపర్యయము లన్నిటిని గడచి నేటికిని సజీవమై ఎసగుచున్నది.

కావున భారతీయుల తత్త్వదర్శనమే వారి సంస్కారశాఖ లన్నిటి నావరించి, ప్రత్యక్ష మగుచున్నది. భూగోళధర్మములందే కాక, వేషభాషలలో, జాతిమతములలో, ఆచారసాంప్రదాయములలో, రాజకీయసంస్థలలో, సంస్కారదశలలో గన్పించు ఈ నానాత్వము ప్రజలకు బరిపాటియై పోయి, అందుండి ఏకత్వమును నరయుట నేర్పినది. ఈ నానాత్వమం దేకత్వమును దర్శించు అద్భుతదర్శనము నీ దేశమునకు వచ్చిన ఆర్యులే అనుగ్రహించిరి. పైపైన కన్పించు నీ భేదము లెంత విశాలముగా నున్నను భారతీయసంస్కారమున గన్పించు నేకత్వమును, అఖండతను, అంతకంటె విచిత్ర

మైన ఐకమత్యమును జూచినచో, నై దేశికుల మాట చెప్ప నేల, భారతీయులకే ఆశ్చర్యము జనించుచుండును.

భారతీయుల తత్త్వదర్శనము కేవలబుద్ధిగ్రాహ్యమైన తర్కమీమాంస గాదు. వారా పరతత్త్వము నొక్కటిగా అనుభవించిరి. నామరూపముల అనేకత్వమందు మరల నా యేకమునే దర్శించిరి. కావుననే వారిహపరముల రెంటిని జోడింపగల్గిరి. ఏకజ్ఞానముచే అనేకమైన జగత్తునందు కర్మాచరణము సల్పిరి. నానామతములందు ప్రతిపాదితమైన ఏకసత్యమను గ్రహించుటచే, మతభేదములు వారికి విరోధకారణములు గాక, సహనమును నేర్పెను. అట్టి సహనమునుండి రూపెత్తిన వారి సంస్కృతి ఎటు వంచిన నటు వంగుచు, అవిచ్ఛిన్నమై, సంఘము నంతటిని ఆవరించి, సంప్రదాయపరంపరను జెడకుండ గాపాడెను.

వారి ఆర్థికరాజకీయసంస్థలలో, వేషభాషాచారములలో, సంగీతసాహిత్యములలో, శిల్పాదికళలలో, మతధర్మములలో, తత్త్వమీమాంసలలో నేటికి నా యేకత్వము కన్పించుచునే యున్నది. ఈవిధముగా నాదినుండియు విరోధములను సమన్వయించుకొనుచు, భిన్నముఖమైన సత్యము నేకముగా దర్శించుచు, భిన్నమూలములైన తత్త్వముల నేకప్రవాహమునకు మలపుకొనుచు వచ్చిన ఈ భారతీయ సంస్కృతి వికృతివిలయము లెఱుగక, నిండారి, నిబ్బరముగా బాఱుచు, ఎడనెడ గలియవచ్చిన క్రొత్తవాగులను దనలో గలిపికొనుచు, సమృద్ధమై, ఏకమై, అఖండమై భారతప్రజా

## హిందువులు: ముస్లిములు

A.D.
711
712
713
988
1001
1004
1007
1008
1010
1013
1014
1015
1018-9
1021
1022
1024
1178
1190-1
1192
1192-3
1194
1195
1196
1197
1198
1202
1205
1205
1210
1212
1229
1232
1234
1244
1251-2
1292
1294
1302-3
1306-7
1360
1361
1362
1365
1443
1446
1466
1419
1455
1465
1527
1559
1568
1595
1611
1620



55

A.D.
1005
1011
1023
1034
1040
1149
1151
1175
1131
1136
1205
1208-9
1216
1217
1226
1230-1
1235
1237
1239
1241
1245
1256-7
1280
1299
1382
1363
1398
1423
1463
1526
1535
1538
1540
1542
1567
1529
1535
1538
1540
1555
1561
1567
1572
1586
1607
1612
1612
1617
1624
1632
1639
1655
1658
1659
1660
1674
1681
1685
1686



59

కోటిపాలిటికి మందాకినియై, నేటికిని వారి నోలలాడించు చున్నది. మధ్యమధ్య వచ్చిన సాంకర్యములచే నీ పురాణ పుణ్యావాహినికి మూలమం దున్న ఏకత్వము చెడిపోలేదు. తనతో బుట్టిన సభ్యత లన్నియు లుప్తములై, పురాణగాథలై పోయినను తానుమాత్రము జీవనదియై పాఱుచున్నది. శాస్త్రీయబుద్ధియందును, సాధనములందును మార్పులు వచ్చినను దాని స్థూలరూపమునకుమాత్రము హాని కలుగలేదు. సంతతమైన ఈ ధారయు, నేకత్వమునే దాని పిండశక్తికి ప్రబలప్రమాణములు.

# మధ్యయుగపు బరిష్కృతి

భారతసంస్కృతి భిన్నభిన్నలక్షణములకు సమన్వయము కుదిర్చి, ఏకత్వమును సాధించినదని గ్రహించితిమిగదా! క్రొత్తగా వచ్చిన ఇస్లాముతోడి ప్రబల విరోధము ఎట్లు సమన్వితమైనదో చూతము. భారతీయసాంఘికసంస్థలు, మతధర్మములువలెనే ఇస్లాముసంస్థలు, ధర్మములుగూడ సుసంఘటితములు, సుస్పష్టములు నగుటయేకాక, ఈ రెండుమతములకు దృష్టిలోనే భేద మున్నది. హైందవధర్మమున సన్యాసవైరాగ్యములు ప్రధానములు, ఐహికసుఖము లప్రధానములు. ఇస్లాముధర్మ మిందుకు చుక్కెదురు. ఐహికసుఖభోగముల నది యుజ్జగింపదు. నవీనముగావచ్చిన యీ యిస్లాముధర్మము పురాతనభారతధర్మము నెదుర్కొని దానిని సమూలముగా గదల్చివైచినది.

దృష్టియం దీ రెంటికి గల భేదమును, విరోధమును భారతీయసంస్కృతి సమన్వయపరచవలసివచ్చినది. నేటి హిందూముస్లిము కలహములను గాంచినచో నీ రెంటికి బూర్ణసమన్వయము గుదురలే దనిపించునుగాని దేశమునం దున్న అపారప్రజాసమూహమును, ఉభయమతములకు దినదినము ఘటించు ఒఅపిడులను గమనించితిమేని ఈమాత్రము సమన్వయమైన కుదిరినందుల కక్కజము జనించును. నేటి కలహకారణములుగూడ ఐహికవిషయములను గూర్చినవే యని మఱవరాదు. మధ్యయుగపు భారతదేశమందే కాదు: ఏ కాలమందైనను, ఏదేశమందైనను రాజకీయములు, ఆర్థికములు నగు నైహికవిషయములే కలహకారణము లగునుగాని మతధర్మములు గావు. ఇస్లాం-హిందూమతస్థులు భారతదేశమున నెంతకాలము పోరాడినను ఆ కలహములలో మతధర్మప్రసక్తి మృగ్యమనియే చెప్పవలెను. కలహములు హిందువులకు, ముస్లిములకే గాదు; ముస్లిములకు ముస్లిములకుమాత్రము పొసగలేదా ? హిందువులు, హిందువులుమాత్రము ఒండొరులతో పోరాడలేదా ?

అరేబియనులు సింధుదేశముపై నెత్తివచ్చినది వర్తకమునిమిత్తమేకాని మతముకొఱకు గాదు. గజనీమహమ్మదు తన తురుష్కపారసీకరాజ్యముకొఱకై భారతదేశైశ్వర్యమును కొల్లగొట్టవచ్చెనేకానిఇతరముగాదు. ఆఫ్ఘనులు మధ్యాసియా

నుండి తమకు ఒత్తిడిజనించుటచే భారతభూమిలోనికి జొఱబాఱివచ్చిరి. ఆర్యులు నిట్టికారణములవలననే ఈదేశముపై నెత్తివచ్చిరి. అట్లే అనేకజాతు లార్యుల ననుగమించినవి. అఫ్గనుతురుష్కదాడులు నిట్టివేకాని క్రొత్త యేమియు లేదు. ఈ ధర్మమే తన జీవితమున దారాకాణించెనని బేబరు స్వచరిత్రమున స్పష్టపరచెను. కాకున్న ఈ దాడులం దొక్క భేదముమాత్రమున్నది. ఆర్యుల యనంతర మీ దేశమున కాఫ్గనులు వచ్చువఱకు సభ్యజాతు లెవ్వియు రాలేదు. వారందరును భారతీయసభ్యతాప్రవాహమునలీనమైపోయిరి. అఫ్గనులతో మొదలుకొని ఈదేశము వచ్చినవారెల్ల ఇస్లాముధర్మమునుపూర్తిగానవలంబించినవారుగాకున్నను, ఇస్లాము సభ్యత నించుక మూచూచి దాని బాహ్యలక్షణము లవలంబించిరి. కావున ఈ యుభయసభ్యతాసంఘర్షణమునం దొకదాని నొకటి మ్రింగుట పొసగనందున, రెండును గరగి ఒక్కటి కావలసివచ్చినది.

# 1

# హిందూస్థాని సంప్రదాయము

ఇస్లాంహిందూమతముల సంఘర్షణ మతిగంభీర మగుటచే ప్రాత తలంపులకు, క్రొత్తతలంపులకు గూడ నొండొంటితో నొరపిడి పుట్టినది. భావుకు లగువారు మరల తత్త్వాన్వేషణకు గడగిరి. మనస్సులు ప్రాతసంప్రదాయముల చెఱనుండి విడివడుటచే ఉభయధర్మములకు సమాధానముగూర్చు క్రొత్తమతములు దలయెత్తినవి. సమన్వయము మాత్రము పూర్తి కాలేదు. రెండింటిమధ్యనున్న యెడ మట్లేయున్నది. రాజధానికి, జనపదములకు బరస్పరభావ వినిమయము జరగినదికాదు. పట్టణములలో ముస్లిములకు సంఖ్యాబలము తక్కువైనను అధికారప్రాబల్య మున్న కతన నచట ఉభయ సంస్కృతులు నొండొంటితో గరగిపోయినవి. అచట నొక్కకట్టుగా పొందిపొసగియున్న ముస్లిమురాజవంశములు నాగరకమర్యాదలకు బాటలు దిద్దినవి. మఱి పల్లెలలో నట్లుగాదు. పట్టణముల కందుబాటులో లేనికతన వాని పరిపూర్ణతకు భంగము కలుగలేదు. మనుజుల రాకపోకలకు, భావము లిచ్చిపుచ్చుకొనుటకు వీలుకలుగమి చిరాగతములగు నచటి కట్టుబాటులు, నడవడులు మార్పుచెందినవి కావు. కావున జనపదములందలి ముస్లిములకు హైందవాచారములే అలవడినవి. మతమునందు మార్పు లెంతగా జరగినను, ఆచారసంప్రదాయములు పల్లెలలో నట్లే నిలిచిపోయినవి.

నేడు మనకుపలబ్ధములగు చరిత్రపాఠములలో హిందూముస్లిము విభేదములే కన్పించునుగాని, ఈ యుభయ ధర్మసమ్మేళన సమన్వయవిశేషములు గన్పించవు. గ్రంథకర్తలు వానిని మఱచిరో, ఉపేక్షించిరో! ఆ గ్రంథము లెంతసేపు నూతనదండయాత్రలను, రాజవంశముల మార్పులను, ప్రజాపీడను, కొల్లగొనుటలను వర్ణించిచెప్పునే కాని సాంఘికసంస్థలలో, ఆచారములలో, సంస్కృతిలో వచ్చిన మార్పులను దెలపెట్టవు. భారతసభ్యతా లక్షణము లన్నియు నేనాడో వికసించినవిగాన భారతసభ్యత యన్నచో హైందవ సభ్యతయే యని హిందువులును, ఇన్ని శతాబ్దులుగా దామీదేశమం దున్నను దామిచట సాధించిన సంస్కృతికి సాక్ష్యములు దొరకకపోవుటచే, నిజముగా నీ దేశపు సంస్కృతి హైందవసంస్కృతియే యగునేమో యని ముస్లిములును పొరపడుట కీగ్రంథము లెడమిచ్చుచున్నవి. ఉభయ మతస్థులును గలిసి నిర్మించుకొన్న నూతనసంస్కృతినిగూర్చిన పరామర్శ లేనికతన ఒకరియెడ నొకరి కనుమానము, ద్వేషము, తిరస్కారము విడువకున్నవి. ఎనిమిది శతాబ్దులుగా ధారపోసిన రక్తస్రవంతులు వ్యర్థమైపోయెనే యను నిరాశయే నేటి మతవిద్వేషముల కెల్ల మూలమని చెప్పనగును.

ఇతర దేశములలోని అనుభవమునుబట్టి విచారించినను హిందూముస్లిముయుద్ధములు మతప్రయుక్తములు గావని స్పష్టపడును. ఏమి జరిగినదో మనకు రూఢిగా దెలియకున్నను ఒక్కవిషయముమాత్రము రూఢిగా జెప్పవచ్చును.

సంపన్నములైన రెండు సంస్కృతు లొక్కచో సమసించి నపుడు ఉభయమునుండి నూత్నసమన్వయ మొకటి రూపెత్తి తీరవలెను. మాన వేతిహాసమం దెచ్చటను అట్టి నిష్ఫల సంయోగము గానరాదు. ఉదారగంభీరమగు భారతీయ సంస్కృతి ముస్లిములు వచ్చునాటికి ఒకింత శక్తి హీనమైన దేమోకాని, శాశ్వతమైన దాని అంతస్సార మట్లేయున్నది. అట్టిచో ముస్లిములకు దాని వాసన యంటకుండునా? ఉభయసంస్కృతుల యాత్మశక్తి కనురూపమైన పరస్పర సహకారము సంభవించియే యుండును. ఉత్తమ సంస్కారు లగు ఆర్యపూర్వులు, ఆర్యులచే విజితులయ్యును, ఆర్య సంస్కృతిస్వరూపమును మార్చివేయగల్గిరి. గ్రీసులో నట్లే మైసీనియనులు రణవిజితులయ్యు ఉత్తమమైన హెలెనిక్ సభ్యతను వికసింపజేసిరి. గ్రీకులనుగూడ నట్లే రోమనులు జయించిరిగాని గ్రీకుసభ్యతచే దామే విజితులైరి. భారత దేశమునఁగూడ నట్లే రాజ్యాధికారము ముస్లిములకు వైవస మైనదేకాని ఆధ్యాత్మికజ్ఞాన విషయమున దృఢతరమును, జిరఫలకారియు నగు సహకార మిరువురు నెఱపుటచే నుభ యులును జయించినవారైరి.

కావున హిందూ ముసల్మాను జాతులు పరస్పరము సహస్రముఖముల నెఱపిన సహకారమే మధ్యకాలపు భారత దేశచరిత్రమం దంకితము గావలసియున్నది. రామానం దుడు, కబీరు, నానకు, చైతన్యుడు మున్నగువా రా సహకార మునకు సాక్షులు. వంగదేశమున వైష్ణవమును, మహా రాష్ట్రమున భక్తిమతమును ఈ సహకారమునకు బ్రత్యక్ష

ఫలములు. ఈ సహకార మొక్క అధ్యాత్మమందే కాదు. పఠానుల కాలమందే ఆచార సంప్రదాయములందు, పండుగపబ్బములందు నూతనత్వము తలయెత్తి, మొగలుల కాలములో నిస్సందేహముగా విస్తరించెను. పాకాది గృహ కృత్యములందుగూడ నీ మార్పులు ప్రత్యక్షమైనవి. నాగరుల వేషములందుగూడ – అరేబియాది, మధ్యాసియాది కాని – క్రొత్తవైఖరి యొకటి పొడచూపెను. భారతదేశస్థులకు నిత్యవ్యవహారయోగ్యమైన నూతనభాషగూడ ఆ కాలమందే అవతరించినది. సంపన్నములగు భారతీయ సాహిత్యము లన్నియు ఈ నూత్నసంస్కారావిర్భాతికి పాత్రులై యున్నవి. ఈ యుభయసంస్కారసమ్మేళన సమన్వయము లిట్లు ఆర్థిక సాంఘిక రాజకీయ జీవనములం దంతట కొనసాగినవి. సంగీత చిత్రలేఖనములలో, గృహనిర్మాణాది విద్యలలో, వివిధ మతాచారాదులలో ప్రాతక్రొత్తలు రెంటి కలయికచే, విడదీయరాని పొత్తుకుదిరిన సరిక్రొత్త లుదయించినవి. ఇట్లుభయ సంస్కృతిసమ్మేళనముచే నుదయించిన భారతీయ ప్రతిభకు హైందవమనిగాని, మహమ్మదీయమనిగాని పేరు పెట్టుట అజ్ఞానవిలసితము, నవిచారమూలకము ననిపించుకొనకతీరదు. బేబరుకాలమునాటికే ఈ సమ్మేళనము సుస్పష్టమై నూతనాకృతి ధరించుటచే ఆ పాదుషా హిందూస్థానీ సంప్రదాయ మని దానికి నామకరణ మొనర్చెను.

అర్థనీతితత్త్వవిద్యాప్రపంచములు రెంటియందును ఈ పొత్తు కుదరలేదని స్థూలదృష్టికి గోచరించునేమో కాని, నిపుణముగా బరిశీలించితిమేని ఈ యుభయసమ్మేళనము వాని

యందమును గోచరించును. నేటి హిందువుల యైహికపార మార్థికదృష్టియందు వేదచోదిత మెంతో, ఇస్లాము ధర్మ చోదిత మెంతో చెప్పలేము. అట్లే, నేటి భారత మహమ్మ దీయుల ఆచారవ్యవహారవిశ్వాసములందు ఇస్లాము ధర్మమున కెంతపాలున్నదో, హైందవసంస్కృతి కెంతపా లున్నదో విడదీసి వచింపలేము. భారతీయ పురాతనసంస్కార వాసన ఒక్క భారతమహమ్మదీయులకే గాదు-అరేబియా పారసీక ములందలి ఇస్లాము తత్త్వశాస్త్రమునకు గూడ సోకినది. అంతియేకాదు; పర్వతాగ్రోపదేశమునకు (Sermon on the Mount) బౌద్ధధర్మ మునుబోధక మైనదని కొందరు పండితులు వచింతురు. ఆసియామైనరులో నుండిన ఎసీనులు (Essenes) ఏనాడో అచటికి వచ్చిన బౌద్ధభిక్షుకులై యుందు రను పక్షముగూడ నున్నది. సూఫీధర్మమునకు మూలము కొరానే యైనను భారతీయాధ్యాత్మవిద్య గూడ దానికి మెఱుగులు దిద్దినది. సూఫీధర్మవికాసమునకు క్రిస్టియను, జొరాస్ట్రి యను మున్నగు నితరమతధర్మములుగూడ కొంత ప్రోది సల్పిన మాట సత్యమే కాని, హైందవబౌద్ధములే ముఖ్యముగా దానిని తీర్చిదిద్దినవని అంగీకరింపవలెను. కానిచో, సూఫీలు జీవాత్మను బరమాత్మయందు లీనముచేయవలె నందురుగదా! మోసెసునాటినుండి నేటివఱకు సెమిటిక్ మతములకు బ్రత్యక్ష విరోధియగు నీ ఆత్మవిద్య సూఫీల కెక్కడినుండి వచ్చినది?

ఇచ్చుట, పుచ్చుకొనుట మనోధర్మము. భారతీయా ధ్యాత్మవిద్యనుండి గైకొనిన సూఫీధర్మము భారతీయ మత ధర్మములకు దానును గొంతయిచ్చినది. ఇస్లాము ధర్మసంప

ర్గముచే భారతమతధర్మములలో శంకరునినాటికే కొంత మార్పు వచ్చినదనియు, ఆమార్పుల వాసన శాంకరసిద్ధాంతమునకు గొంత దగిలినదనియు చెప్పినచో నెవరును నమ్మరు. శాంకరసిద్ధాంత మనన్యమనికదా విశ్వసింతురు. ఐనను సావధానముగా విచారించి చూతము. ఆది కాలమునుండియు భారతీయధర్మములందు, సిద్ధాంతములందును వచ్చిన మార్పులుత్తరభారతము నుండియే అవతరించినవి కదా! అట్టిచో ఉన్నట్లుండి, ఎనిమిదవ శతాబ్ది మొదలుకొని పరతత్త్వాచార్యపీఠము దక్షిణభారతమున కేల దక్కినది? శంకర రామానుజులు, నింబాదిత్య వల్లభాచార్యులు — అందరు దక్షిణభారతసంభవులేకదా! శైవ వైష్ణవ సిద్ధాంతములకు గూడ దక్షిణభారతమే ఆలవాలమైనది. ఉత్తర దేశమందలి ఆ నాటి రాజకీయసంక్షోభములే ఇందులకు గారణమన్నచో జాలదు. ఆచార్యపీఠమిట్లు హఠాత్తుగా దక్షిణమునకు జరిగిపోవుటకు హేతువులను బరిశోధకు లూహింపలేకున్నారు. ఏడవ శతాబ్ద మధ్యకాలములో దక్షిణభారతమున ఇస్లాము ధర్మము గాలువెట్టినది. దాని రాకయే ఈ మార్పునకు హేతువేమో విచారింతము.

మహమ్మదు బిన్ కాసిము సింధుదేశమును జయించుటకు బూర్వమే అరేబియను వర్తకులు తిరువాన్కూరుకేతెంచిరిగాన, దక్షిణదేశమందే ఇస్లాము మొదట నడుగు మోపినది. ఇస్లామిట్లు శాంతముగా బ్రవేశించిన కొంత కాలమునకు, మలబారు నేలు చేరపెరుమాళు ప్రభువులలో దుదివాడత డిస్లాము ధర్మమును గైకొని, మక్కాకు తీర్థ

కుడై యరిగెను. కాలికట్టు ప్రభువుల 'జామొరిన్' బిరుదమే ఈ వృత్తమునకు దార్ఢ్యాణ. నేటికిని 'మాపలామహమ్మదీయుడే జామొరిను నభిషేకించు నాచారము కలదు. శంకరుని జన్మస్థానమగు 'కాలడి' గ్రామము నేలు సంస్థానపతి గూడ ఇస్లాముధర్మము గైకొనెను. వీరందరు రణవిజితులై, ఇస్లాముధర్మము నంగీకరించిరేమో యనుకొందమన్న అందులకు బ్రమాణములు లేవు. ప్రభువు పరమతము స్వీకరించుటచే బ్రజలుగూడ నొక్కుమ్మడి దన్మతప్రవిష్టులైనట్లును ఆధారములు లేవు. బలాత్కృతముగాని ఈ యిస్లాముమతప్రవేశమునుబట్టి దక్షిణభారతమున ఇస్లాముధర్మమున కున్న చెల్లుబడి ననుమానింపవచ్చును.

ఈ యుభయధర్మసంఘర్షనచే అందఱి మనస్సులును సంశయావృతములై యుండుట సాజము. అట్టిచో శంకరుని వంటి మహామేధావి యీ నూతనధర్మమునుగూర్చి యోచింపకుండునా? తన స్వభావమున కనురూపములగు నంశములను గైగొని జీర్ణించుకొనకుండునా? మఱియు, నుత్తర భారత సిద్ధాంతములకు సమన్వయబుద్ధియు, నుచితజ్ఞతయు, మననశీలము బ్రధానలక్షణములుగదా! అట్టిచో, దక్షిణ భారతమందు బొడమిన నూతన సిద్ధాంతములకు మున్ను లేని భక్త్యావేశము, కర్మవాదనిరతి ఎచటనుండి వచ్చిన వని కూడ మనము యోచింపవలసియున్నది. తర్కశీలము, నుదాసీనము, సాత్త్వికమునై యొప్పు నుత్తరభారతీయస్వభావము దక్షిణమున హఠాత్తుగా రజఃప్రధాన మైపోయినది. దాక్షిణాత్య తర్కవాదములందుగూడ మహావేశము బ్రత్యక్ష

మైనది. శాంకరసిద్ధాంతమున ప్రత్యంశమునకు ప్రస్థాన త్రయము ప్రమాణస్థానము గావచ్చునుగాని ఆ సమన్వయ పద్ధతియు, నందలి గాఢాభిరతియు గ్రొత్తవై, వింతవై తోచును. శాంకరసిద్ధాంత మందలి యీ నూతనావేశము నకు, ఇస్లాముధర్మ గాఢావేశమునకు సంబంధ మున్నదని యనుమానించుట అపోహావిలసితమని త్రోసిపుచ్చదగునా?

భారతీయ మతాచార్యులలో శంకరుడు నిరుపమా నుడు; కేవల భారతధర్మ మాతని యందు మూర్తీభవించె ననియు, సనాతన బ్రాహ్మణ మతమునకు బౌద్ధ సాంకర్యము సోకకుండ నాతడు రక్షించెననియు జెప్పుదురు. శంకరుని జగన్మిథ్యావాదమున నీతి ధర్మములకు చోటు లేదని కూడ కొందఱి మతము. కాని, శంకరుని శుద్ధాద్వైతము, జగత్తు కేవల భ్రమారోపిత మని త్రోసిపుచ్చుట నిజమగునేని, మిథ్యా జగత్తునందు కర్మాచరణముతో నింక బని యేమి? ఆ పక్షమున, సంసారము బంధహేతువనియు, కామ విజయ ముచే దానినుండి ముక్తి బొందవలయుననియు చెప్పెడి బౌద్ధముతో శంకరుడు నేకీభవించినట్లగును. శంకరునిది కేవలము మాయావాద మనువారుగూడ బౌద్ధనిర్వాణమును, అకర్మణ్యతను అతడు ఖండించెనని చెప్పుదురు గదా!

నిజమునకు శంకరుడు బౌద్ధుల మాయా వాదముపై వారి యస్త్రములనే త్రిప్పి ప్రయోగించెను. జగత్తు బరమ సత్యము గాదను బౌద్ధవాదము నాత డంగీకరించుచునే కేవలానాత్మవాదమున కాపత్తులు చూపెను. బౌద్ధులింద్రి యానుభవమునందలి విరోధములను బట్టి జగత్తు నసత్తని

అనుమానింపగా, శంకరుడు, జగత్తు అసత్తను అనుమానమునకుగూడ అనుభవమే ఆధారముగదాయని త్రిప్పికొట్టెను. శంకరుడు జగత్తును అనిర్వచనీయ మన్నాడు. జగత్తు అసత్తయినచో దాని అనుభవ మెక్కడనుంచి వచ్చినది? దానిని భ్రమ యందుమేని ఆ భ్రమ యెట్టిదో నిర్వచింపవలసియుండును. కావున మనకు భ్రమను కల్పించునది అనిర్వచనీయ మనియే ఎంచవలసియుండు నన్నాడు శంకరుడు.

ఈ విధముగా శంకరుడు బుద్ధుని వాద మంగీకరించుచునే, లోకసామాన్యమున కవినీతిహేతువైన శూన్య వాదమునుమాత్రము ఖండించెను. ఆత్మ సత్యమని చెప్పుచు, అది నిత్యమనియు, జగత్తు మాయచే నాత్మయందే ఆరోపితమగుచున్న దనియు, కావున మాయ యున్నంతవఱకు జగత్తునకు వ్యవహారసత్త నంగీకరింపవలెననియు, ఆ మాయను దాటి పరమాత్మజ్ఞానమును బొందినపుడు బ్రహ్మ మొక్కటే సత్యమని తెలియనగు ననియు అద్వైతమును స్థాపించెను.

బౌద్ధుల తత్త్వవిచారముతో పాటు వైదికకర్మలను, ఈశ్వరునిగూడ శంకరు డంగీకరించెను. గృహస్థులకు వేద విహితమగు కర్మలను విధించెను. సగుణారాధన రూపమైన భక్తిమార్గమునుగూడ శంకరు డంగీకరించెను. కేవల నిర్గుణ ధ్యానము అనధికారులకు నిరుపయోగమని గ్రహించి, పామర లోకమంతటికి ఏక మార్గమును జూపి, శంకరుడు దేశము నుద్ధరించెనని చెప్పవచ్చును.

శాంకరసిద్ధాంతమున మూడవది కర్మ విషయము. కర్మావశ్యకతను బోధించుటేకాక ఆతడు కర్మల నాచరిం

చెను. శంకరుడు కర్మలను నిషేధించెనని మనము పొరపడుట పరిపాటియైపోయినది. అట్లు నిషేధించుటే నిజమేని శంకరుడును బౌద్ధము నంగీకరించినట్లే. వేద విహితములగు కర్మలు గృహస్థుల కవశ్యాచరణీయములని అతడు మాటి మాటికి చెప్పుచువచ్చెను. శంకరు డవతరించునాటికి కర్మల యెడ జీర్ణ హిందూధర్మము అశ్రద్ధను, జీర్ణ బౌద్ధ ధర్మము నిషేధమును అవలంబించుటచే నాతడు కర్మాచరణము నంతగా నొక్కి చెప్పియుండును. గీతోపదేశముగూడ కర్మల విషయమున శంకరునకు ఉద్బోధకమైయుండును. శంకరుని జన్మస్థానమున ఇస్లాముధర్మము బలీయమగుటయే శంకరుడు కర్మల నంగీకరించుటకు ముఖ్యహేతువై యుండునని కొందఱూహించుచున్నారు. శంకరు డొకవంక బ్రహ్మమొక్కటే సత్యమని చెప్పుచు, నింకొకవంక కర్మ లాచరణీయము లని చెప్పుటలో ఇస్లాముధర్మసామ్యము గోచరించుట వింతగను, విచారణీయముగాగూడ నున్నది.

శంకరుని జీవితమందును, సిద్ధాంతములందును భారతీయ సంస్కార విశేషలక్షణమైన సమన్వయము మూర్తీభవించనది. అనుష్ఠానయోగ్యమగు తత్త్వము నుపదేశించుటయేకాక, ఒండొంటితో దలపట్లుపట్టుకొని కలహించుచున్న హైందవబౌద్ధ ధర్మముల రెంటిలోని మేలిమి నాతడుగ్రహించి, రెంటికిని సమన్వయము గుదిర్చెను. ఇంతియేకాక, భారత దేశ స్వభావమున కనురూపములైన ఇస్లాము ధర్మములను గూడ తన సమన్వయమం దాతడు మేళవించెను. శంకరుని ఏకేశ్వరవాదమును, ద్వైతమతఖండనమును, వేదప్రామా

ణ్యమును, తాను చేసినది వైదికమతోద్ధరణమాత్రమే యని యాత డెంచుటయును - ఇవి యన్నియు నిస్లాముధర్మసామ్యమును తలంపునకు గొనివచ్చుచుండును. ఈ సామ్యమునకు దోడు, అతని జన్మస్థానమం దప్పటికప్పుడే ఇస్లాము ధర్మము వేరూనుటనుగూడ గలిపి యోచించినచో, ఇస్లాము ధర్మము గూడ ఆతని కుద్బోధకమైయుండు నను అనుమానము తల చూపకుండ నివారించు టెట్లు?

భారతదేశమున మధ్యకాలమందు జరిగిన ధర్మ సమన్వయమునకు శంకరు డీరీతిగా నంకురారోపణ మొనర్చిన వాడయ్యెను. ఆ పిమ్మట రామానంద కబీరులు, దాదూనానకులు, చైతన్య తుకారాములు నామార్గమునే యనుసరించిరి. చిరాగతమైన సంప్రదాయమునకు భంగముకలుగకుండు టయే ఈసమన్వయోద్యమమందలి విశేషము. క్రొత్తలక్షణములను ప్రాతవానితో, అతినిపుణముగా కరగించి, కలిపికైచి, భారతీయ పారమార్థికదృష్టి నఖండ వాహినిగా నొనరించిరి.

## 2

## అర్థనీతి, కళలు

మధ్యకాలిక భారతదేశార్థనీతియందు గూడ విరోధ సమన్వయములే చూపట్టుచున్నవి. కర్షకవృత్తి ప్రధానమైన తొల్లిటి యర్థనీతికి పరాక్రమణహేతువుచే భంగము వాటిల్లి వీరమాన్య (Feudal) మగు జమీందారీ పద్ధతి తలయెత్తెను. వ్యష్టిప్రయోజనముల కాలవాలమైన ఈ పద్ధతి నతిక్రమించి

సంఘక్షేమమును సాధింపనెంచి అలాయుద్దీను జీవనాధార ద్రవ్యములకు గొంతవఱకు ధరలు నిర్ణయింప బ్రయత్నించెను. మహమ్మదుతుగ్లకు చర్మపునాణెములను జెల్లుబడి కల్పింప జూచెనుగాని, కాల మందుల కింకను బరిపక్వము కాని హేతువున కృతార్థత గలుగదయ్యెను. చెల్లుబాటే తప్ప నాణెముల కింకొక విలువ లేదని ఆనాడే గ్రహించిరని దీని వలన దెల్లమగుచున్నది. అర్థనీతిరాజనీతులు పరస్పరాశ్రయములు; ఏకజాతిరాజ్య (Nation State), ధనమూల వాణిజ్యములు (Capitalism) నట్టివేయని తజ్జ్ఞు లెఱిగినదే. కాని భారతదేశచరిత్రమున వీని ఫలితములను పరామర్శింపక విడిచిరి. అక్బరు తెలిసియో, తెలియకయో ధనమూల వాణిజ్యమునకు ద్రోవతీసిన విషయమును జరిత్రకర్తలు గుర్తింపరైరి. ప్రభుత్వ వ్యవహారములందే కాక ఇతరత్ర కూడ నక్బరు వస్తువినిమయమును (Barter) మాన్పించి, నాణెములకు ప్రవేశము గల్పించెను. షర్షాతో నారబ్ధమైన భూస్వామ్యసంస్కారమునుగూడ నాతడు పూర్తిగావించెను. వీరమాన్య పద్ధతికి గాలక్రమమున స్వస్తిచెప్పి, ధనమూల వాణిజ్యమునకు బాటలు తీర్చవలె నను సంకల్పమే ఈ యత్నము లన్నిటికి మూలమని కన్పించునుగాని తత్సంకల్ప సిద్ధికి ప్రధానోపాయమగు భూతప్రకృతి వశీకరణము కొనసాగమి నాయత్నములు ఫలింపవయ్యె. మధ్యకాలపు భారతదేశములో కొన్నిసంఘములకు, వ్యక్తులకు బొడమిన స్పర్ధలకు గూడ హేతువు లార్థికసాంఘికములే కాని అన్యములు గావు. లోకసామాన్యమైన యీవిషయమును ఆ కాలమం దేర్పడిన

ఒకానొక సందర్భము ఋజువు చేయగలదు. ఎట్లన— మధ్యాసియాయందలి భౌగోళికధర్మములే ఆర్య లీ దేశమున కేత్తివచ్చుటకు గారణమని మున్న చెప్పితిమి. అట్లే మధ్య కాలమున భారతదేశమందు రాజపుత్రశక్త్యావిర్భావతికి, తదవధికి సంబంధము నిరూపింపవచ్చును. ఎనిమిదవ శతాబ్దికి బూర్వమందును, ఔరంగజేబు అస్తమించిన పిమ్మటను లేని ప్రాధాన్య మీరాజపుత్రుల కామధ్యకాలమున నెట్లువచ్చినది? సంఖ్యవలనను, రాజ్యాధికారమువలనను వీరికంటె బలవత్తరులైన ఇతర వంశీయు లున్నను వేయి సంవత్సరములపాటు చెల్లివచ్చిన రాజపుత్రుల ఆధిక్యమునకు గారణ మూహింపవలసియుండును. ఎనిమిదవ శతాబ్దివఱకు భారత రాజ్యాధిపత్యము గంగాతీరమున విలసిల్లినది. అశోకుడు మొదలు హర్షవర్ధనునివఱకు బూర్వభారతమే అధికారము నెఱపెను. ఎనిమిదవ శతాబ్దితో నా యధికార మున్నట్లుండి మధ్యదేశమందున్న ఢిల్లీనగరము నాశ్రయించెను. ఢిల్లీ నగరము రాజధానిగా నున్న వేయేండ్లును రాజపుత్ర విజృంభణము చెల్లినది.

భారతదేశమున వర్తక కేంద్రములు మారుటయే ఈ మార్పునకు గారణమని తోచుచున్నది. ఎనిమిదవ శతాబ్దివఱకు వర్తకవ్యాపారాదులు పూర్వదిక్కుగా బ్రవహించినవి. ద్వీపాంతరములందు నెలకొన్న భారతాధినివేశములతోడను, చీనాజపానులతోడను వ్యాపారాదిసంబంధము లా కాలమున నవిరతములై ప్రవర్తిల్లెను. పడమటి దెసనున్న యూరపుతో గూడ వ్యాపారసంబంధము లేకపోలేదుగాని, అది ప్రాగ్దిశా

వ్యాపారమంత విస్తారము గాదు. కావున తూర్పుదీవులనుండి వచ్చిపడుచున్న ఐశ్వర్యముతో రాజ్యాధికారము పూర్వ భారతమందే పట్టముగట్టుకొన్నది. ఇంతలో అరేబియను రాజ్యము తలయెత్తి, పశ్చిమ భారతముతో వ్యాపారము నారంభించెను. ఏడవ శతాబ్దిలో దక్షిణ భారతమందును, ఎనిమిదవ శతాబ్దిలో సింధుదేశమందును అరేబియనులు వ్యాపారనిమిత్తముగా గాలూనిన విషయము నీవఱకే ప్రస్తావించితిమి. అరేబియాతోడి యీ బేహారమునకు ఘూర్జరము నిలయమగుటచే, ఐశ్వర్యము పశ్చిమదిశనుండి భారతమునకు జాల్వారజొచ్చెను.

భారతీయుల ద్వీపాంతరవ్యాపార మిట్లు పడమటి దెసకు మాఱినప్పుడే రాజపుత్రులకు ప్రాధాన్యము వచ్చినది. రాజపుత్రస్థానము ఢిల్లీనుండి గుజరాతునకు బోవు మార్గ మం దుండుటగూడ నిప్పట్ల గమనింపదగినది. ఈ మార్గ మెవరి చేతిలో నుండునో వారికి ఉత్తర భారతాధిపత్యము సంక్ర మించును. అంతటితో రాజపుత్రుల అంతఃకలహములు సమసిపోయి, ఢిల్లీకి, మావారుకు స్పర్ధ లేర్పడినవి. అలా యుద్దీనునాటినుండి అక్బరునాటివఱకు జరగిన భారత దేశగాథ ఈ స్పర్ధనుగూర్చినదే. అప్పుడపుడు మతముపేరట, ధర్మము పేరట ని యుద్ధములు పొసగినను మొత్తముమీద ఈ వ్యాపారపుదారిని జేజిక్కించుకొని, దేశైశ్వర్యమును వశీక రించుకొనుటకే నిరంతరయుద్ధములు సాగెనని చెప్పవచ్చును.

రాజపుత్రుల అభ్యున్నతివలెనే వారి పతనము గూడ గమనింపదగినది. ఔరంగజేబుకు, రాజసింహునకు ప్రవర్తిల్లిన

యుద్ధము లీ పతనమునకు గారణములు గాజాలవు. ఏలనన, ఢిల్లీ మీఁవారుల కంతకంటె దారుణయుద్ధము లంతకుమున్ను జరగినవి కావా? అలాయుద్దీను బేబరులు అంతకుమున్ను రాజపుత్రుల నెన్నిమారు లోడించినను వారి శౌర్యమును మట్టుపెట్టగలిగిరా? దండనీతి నేకాక, సామమునుగూడ అక్బరు రాజపుత్రులయెడ బ్రయోగించి వారిని తమ సామ్రాజ్య దిగ్గజముల జేయజూచెనుగాని, కృతకృత్యుడు గానేర డయ్యెను. కావున రాజపుత్రపతనమునకు గారణాంతరమును వెదుకవలసియుండును. వ్యాపారమార్గ మందలి మార్పుచే నుద్భవించిన రాజపుత్రోన్నతి మరల నట్టి మార్పుచేత నే అంతరించి యుండుననుట యొప్పును. తూర్పుదీవులతోడి వ్యాపారముకంటె పడమటిదేశముల తోడి వ్యాపారము ముఖ్యమగుటతో ఘూర్జర దేశమునకు, రాజపుత్రులకు ప్రాముఖ్యము వచ్చినది. అట్లే 'గుడ్ హోపు కేపు' మీదుగా క్రొత్తదారి యేర్పడి కాలికట్టుకు, తూర్పుకోస్తా పట్టణములకు వ్యాపారప్రాముఖ్యము ఏర్పడినంతనే తొల్లి ఘూర్జరమునకు, రాజపుత్రులకు బట్టిన మహోచ్ఛదశ యంతరించినది. ఈ క్రొత్తమార్పుచే మహారాష్ట్రమునకు దశ యందికొన్నది. వలందులకు (Holland), బుడతకీచులకు (Portuguese), ఇతర యూరోపు దేశస్థులకు భారత దేశముతో క్రొత్తగా నేర్పడిన వ్యాపారసంబంధముచే సహ్యాపర్వత (Western Ghats) మార్గములకు బ్రాముఖ్యమువచ్చెను. యూరోపుతోడి వర్తక మిట్లు నానాటికి వర్ధిల్లుటచే ఐశ్వర్యముతో రాజ్యాధికారము గూడక్రొత్తదారులబట్టి, మదరాసు, కలకత్తాలనాశ్రయించెను.

రాజపుత్రుల యనంతరము దలయెత్తిన మహారాష్ట్రులు లాంక నూరేండ్లపాటు ప్రసిద్ధులైరిగాని, వ్యాపారము వలందులయు, బుడతకీచులయు హస్తములనుండి జాణీ, పరాసులకు, బ్రిటిషర్లకు జేజిక్కినంతనే మహారాష్ట్రుల దశగూడ దొలగి పోయెను. కాని బొంబాయినగరము ఓడ రేవయ్యెను గాన మహారాష్ట్రులు రంగమునుండి నిష్క్రమించుట మాత్రము తటస్థింపలేదు. రాజపుత్రులకు, మహారాష్ట్రులకు ఢిల్లీతో బొసగిన యుద్ధములు మతధర్మ ప్రయుక్తములని చెప్పుట కద్దుగావున నింతదూరము చెప్పవలసివచ్చినది. యుద్ధము లన్నియు అర్థనీతిరాజనీతిప్రయుక్తములే యనియు, వానికి మతధర్మప్రసక్తి ఆరోపితమగుట కాకతాళీయమనియు నింతకు ఫలితార్థము.

భారతీయకళాసాంప్రదాయమును, ఏకత్వమునుగూడ మధ్యకాలమున రక్షింపబడెను. అనేకత్వమం దేకత్వమును దర్శించుటయే భారతీయసంస్కారలక్షణమని మున్ను చెప్పితిమి. జగత్తునందలి అనేకత్వమునుండి ఆత్మను మరల్చి, యోగభక్తి సాధనలచే పరమాత్మానుసంధాన మొనర్చి ఆనందానుభూతియే భారతీయుల తత్త్వదర్శన మార్గ మని కూడ చెప్పితిమి. అట్లు పరమాత్మానుసంధానము సిద్ధించిన మీదట తిరిగి జగత్తును దర్శించినపుడు దాని అనేకత్వమందు సూత్రితమైన ఆత్మదర్శనమే లభించును. వాస్తువిద్య ఈ యాత్మలీలకు రూపము గల్పించును. ఆలయోపరిభాగమునం దంతట నీ రూపసమృద్ధియే, ప్రవేలెడంత యెడమైన కన్పింపక, పఱచినట్లుండును. ఆ రూపకల్పన మందలి వివరములలో,

అలంకారములలో విశ్వమయమైన ఆత్మవిభూతి సాక్షాత్క రించును. గుహావలె నుండు ఆలయాంతర్భాగమున దీపకళిక వెలుగుచుండును. జీవున కా పరమైకాంతమున ఆత్మోపలబ్ధి సిద్ధించును.

దాక్షిణాత్య దేవాలయములందు అచ్చముగా భారతీయసంప్రదాయమే గోచరించును. దక్షిణసంప్రదాయమను నది వేరుగా లేకున్నను ఆ యాలయములలో కల్పనాభేద మెంత యున్నను, వాని భావనయు, రచనయు నొక్కతీరుగా నుండును. ఉత్తర దేశాలయములందుగూడ పరస్పర సామ్యమున్నను,లోకమందలి యితర దేవాలయములకంటె నవి వేఱై కన్పించుచుండును. మధ్యకాలమున ఉత్తరభారతమందు నిర్మితములగు దుర్గప్రాసాదసమాధులందల్లే పారసీక శిల్పసామ్యము గోచరించుచున్నను ఆశిల్పసూత్రములు వానికి వర్తింపవు. ఏతన్నిర్మాణమున పారసీకశిల్పరీతులు గొంతవఱ కుద్బోధకములయ్యేనే కాని భారతీయ సంప్రదాయమునకు హాని మాత్రము కలుగలేదు.

దాక్షిణాత్య దేవాలయములందు ఋజు రేఖలు ప్రధానములు. ఆ నిర్మాణములందంతట రేఖలు, కోణములు దీర్చినట్లుండును. ఇక అలంకారశిల్పరచన వానిసొమ్మే. ఏకశిలా నిర్మితములగు నా స్తంభములన్నియు రూపకల్పనాసమృద్ధిచే విరాజిలుచుండును. పునరుక్తిపొంతబోని ఆ రూపసమృద్ధి నెంతని కొనియాడగలము! కాంచీపురాలయ మంటపము నందలి వేయికంబములలో దేని తీరు దానిదే; రూపకల్పనమున వేయింటను వేయిపోకడలు! సింహాచలమందలి చిన్న

గుడిలోగూడ నే స్తంభమున కా స్తంభము ఆకారశిల్పా దులయందు వేఱై కన్పించును. విశ్వతోముఖమైన ఈ రూప సంపదచే మనస్సును ముగ్ధ మొనర్చుటయే యీ శిల్ప ప్రయోజనము.

కళానభిజ్ఞమగు స్థూలదృష్టికిగూడ నుత్తర భారత శిల్పము దాక్షిణాత్యముకంటె వేఱై కన్పించును. అచటి దేవాలయములందుగూడ తోరణములతీర్పులు, వలయముల వంపులేగాని ఋజు రేఖలు కన్పింపవు. ఆలయములందు విమానకల్పన మరుదుగా నుండును. గోపుర నిర్మాణము గూడ దాక్షిణాత్యముకంటె భిన్నము. ఉత్తరదేశ శిల్పమును మాత్రమే చూచినవారీ రహస్యము నెఱుగరు. ఆలయము నకు, మసీదునకు గల భేదమునే కాని, సామ్యమును వారు గుర్తింపజాలరు. దక్షిణదేశాలయములు మాత్రమే చూచిన వారికి ఉత్తర దేశపు శిల్పమంతట మసీదుల సౌరభమే గుబాళించును. ఉత్తరభారతశిల్పములందు హిందూ ముస్లిము రీతులు రెండును మేళవించియుండునుగాన వారి కిట్లు కన్పిం చుట విపరీతముగాదు.

ఉత్తరదేశ శిల్పమునందు అలంకార విగ్రహ రచనా భావము కాకతాళీయమని యెంచజనదు. ఆకృతులయందు తూకమును, రేఖలయందు సామ్యమును వానికి ప్రధాన లక్షణములు. సమవిభక్తాంగములగు నా శిల్పములందు భావై క్యము గోచరమగును. అంగభేద సమృద్ధికంటె అంగాంగీ భావమేళనమే ఉత్తరశిల్పలక్షణము. మతవిషయమున విజా తీయతను బరిహరించుట లోకస్వభావమై యుండ, భార

ీయులు తమ దేవాలయములందు గూడ ముస్లిము సంప్రదాయముల నంగీకరించి ఉభయసంస్కార సమన్వయముచే తమ సంస్కృతికి పుష్టిని, నూత్నచైతన్యమును సమర్థించిన వారైరి.

ఈ సమన్వయము హైందవ శిల్పమునందే కాదు; భారతీయముస్లిముశిల్పమందును ప్రత్యక్షమైనది. ముస్లిము శిల్పమునకు సారళ్యగాంభీర్యములు సామాన్య లక్షణములు. రేఖాసంయోజనమాత్రముచేతనే గంభీరసుందరాకృతిదాల్చు నాశిల్పములం దలంకారరచనకు దావుండదు. ఎచటనైన అలంకృతి యున్నచో, నది చదరములు ముక్కోణముల తీర్పునేర్పును, జిలుగువ్రాతల సోయగమేగాని ఇతరము కన్పింపదు. ఈ ముస్లిముశిల్పరీతి భారతదేశమున చప్పగా మాఱిపోయినది. తొల్లిటి పరుషగంభీరత పోయి, కొంత మార్దవ మలవడినది. భారతీయమైన రూపరచనా సమృద్ధిని గూడ నించుక పుడికిపుచ్చుకొన్నది. నారసానికి శిల్పలక్షణమైన ఆకార సౌందర్యమును, భారతీయమైన అలంకృతి సమృద్ధియు భారతముస్లిముశిల్పమందు మేళవించినవి. ఈ సమ్మేళనపరిణతిచే టాజమహాలువంటి అలౌకిక సుందరశిల్పమావిర్భవించినది. అపరిణతశిల్పములం దీరెండు సంప్రదాయములలో నొకటి ప్రధానమై కన్పించుచుండును. ఫతేపూరు సిక్రీవంటి అద్భుతశిల్పము లీ సమన్వయ సిద్ధికి సాక్షిభూతములై నిలిచియున్నవి. హైందవసంప్రదాయమునకు మచ్చుతునకలగు పద్మకలశాలంకారములు మొగలు పాదుషాల గోరీలలోనే కన్పించుచున్నవుడీ యుభయ సంప్రదాయముల

పోలికలను, వాని సమన్వయమును వేఱుగా దడవబని లేదు.

కళాసృష్టియే మానవజాతి కమరత్వ మొసగునది. రాచరికములు వచ్చును, బోవును. వానికి శాశ్వతత్వము లేదు. తత్త్వమీమాంసలు గూడ వాదభేద పరంపరచే, వ్యాఖ్యానబాహుళ్యముచే స్వస్వరూపమును గోల్పోవును. కళలుమాత్రము దమ సారళ్యసహజత్వములచే మన చైతన్యమం దంకితములై నిలుచును. కావుననే ఆయా జాతుల శీలస్వభావాదులు వారి కళలయందు ముద్రితములై, తరతరముల దర్శనమిచ్చుచుండును.

కళలలో ప్రాకృతత్వశాశ్వతత్వములకు జిత్రలేఖనమే పెట్టినది పేరు. వ్యవహార ప్రయోజనములగు శబ్దములు సాంఘికాచారాదుల మార్పుతో దమ యర్థమును గోల్పోవుచుండును. గానము ప్రకృతిరమణీయ మగునుగాని, చిర స్థాయి కాదు. దానిచే నుద్దీపితమగు భావపరంపరకు రూపముగాని, స్థాయిగాని లేమి, నాత్మయం దవి సుస్థిరత్వము నందక, అస్పష్ట వేదన లీనిపోవును. ఆయాజాతుల స్వభావ ప్రకాశమున కీయస్పష్టతకతన గాన మసమర్థ మగుచున్నది.

చిత్రలేఖనమన్ననో, ప్రాకృతభావములనే కాక జాతి స్వభావవిశిష్టతను, అనిత్యమగు నాకృతిని గూడ జిత్రింప జాలును. స్వభావసిద్ధమగు చైనీయుల పొదుపరితనమును, సునిశితమగు పారసీకుల పనితనమును వారివారి కళలయందు మూర్తిమంతములై కన్పించుచున్నవి. హాలండు దేశపు మధ్యతరగతిసంసారుల సభ్యతయందలి దృఢత్వము నానాటి డచ్చిచిత్రములును, నేటి యూరోపు పడుచున్న ఆత్మవ్యథ




క్రీ. పూ. 300 నుండి క్రీ. శ. 1700 వరకు వెలసిన భారతీయ
వాస్తు శిల్పమునకు ప్రత్యక్ష నిదర్శనములు

1. సాంచీస్తూపము 2. జీర్ణోద్ధారము చేయబడిన బోధగయ ఆలయము 3. బార్వార్ సాగర్‌లోని (మ. ప.) విష్ణ్వాలయము 4. తంజావూరులోని బృహదీశ్వరాలయము 5. కుతుబ్‌మీనార్, ఢిల్లీ 6. గియాసుద్దీన్ తుగ్లక్‌గోరీ 7. పాలిటానాలోని జైనదేవాలయము 8. చిత్తూరులోని విజయగోపురము 9. హుమయూన్‌గోరీ. ఢిల్లీ 10. ఫతెపూర్ సిక్రీలోని "బూలంద్ దర్వాజా" 11. ఆగ్రాలోని తాజీమహల్ 12. బీదపూరులో ఉన్న మహమ్మద్ అదిల్‌షా గోరీ.

నీనాటి చిత్రములును స్పష్ట మొనర్చుచునేయున్నవి. ఈ యుభయలక్షణముల నింత స్పష్టముగా వారి యితర కళలు ప్రదర్శించుటలేదు. ఇతరదేశపు జిత్రకళయందలి యీ ధర్మము భారతచిత్రకళయందును గన్పించుచునేయున్నది.

విస్మృతమైపోయిన భారతీయ చిత్రరచనాచరిత్ర మనకు బ్రస్తుతముగాదు. పర్యాయప్రాప్తములగు శత్రు జైత్రయాత్రలను గడచి, బ్రదికిన చిత్రములను కాలధర్మమే తనపొట్ట నిడుకొన్నది. అజంతాపర్వతగుహాలలో దలదాచు కొన్న చిత్రనిక్షేపములుమాత్రము నిత్యతనే రంగరించి, రూపచిత్రణమునల్పు కౌశలమునకు సాక్షులై నిలిచియున్నవి. వాస్తవకాఠిన్యమున కందని చైతన్య మామూర్తుల యద్భుతమార్దవమున తొలకరించుచుండును. వేడిని, వెలుగును జేటలతో జెఱిగిపోయు నీ దేశపు గ్రీష్మమే తనకాంతిలో రూపభేదములను గరగించివేసి, అస్పష్టమగు ఆకార రేఖా రమణీయతను గల్పించును. నానాజాతుల అనుభూతిసమన్వయమందు జనించిన పురాతనసంస్కారమునకు రసమయత్వమును గల్పించిన యీ గుహాచిత్రవీథులందు విరుద్ధలక్షణములకు గుదిరిన పొందిక ధ్వనించుచుండును. ఆ చిత్రములందు పామరజీవనమును, భక్తజీవనమును జెట్టలువట్టి కనుపండువొనర్చును. పామరజీవనమున నవయౌవనకామవికారములును, వీరవిహారములును, సంసార సౌఖ్యపరంపరయు వెల్లువలై ప్రవహించుచుండును. భక్తజీవనమున శమదమములును, ధ్యానసమాధులును, భక్తివైరాగ్యములును శాంత గంభీరములై రూపుదాల్చినవి. ఈ యుభయజీవనములకు

గల విరోధము సమన్వితమగుటచే నవి యొండొంటి నొరసికొని, నిండారిన జీవనపౌష్కల్యమును, ఆవేగమును సూచించుచుండును. స్త్రీ బాలవృద్ధమగు ప్రజ వివిధభంగిమలతో, అభినయములతో కలగూరగంపయై నేత్రపర్వమొనర్చును. కంఠదఘ్నమై వెల్లిగొన్న జీవనసమృద్ధిలో, ఆ చిత్రకారుడు, కాలుసేయాడక, కళాసమృద్ధిని, భావవైవశ్యము నొక్కుమ్మడి నిట్లు క్రుమ్మరించి కృతకృత్యుడయ్యెనా యనిపించును. ఇంతటి నానాత్వమందుగూడ ఏకాత్మత దర్శనమిచ్చుచునే యుండును. మానవమూర్తులు, నితరమూర్తులు బరస్పరానురక్తములై, విశ్వవిభూతియందలి సర్వాత్మతను బ్రదర్శించుచుండును. ఇన్ని విరోధములను, ఇంతటి భావశబలతను, ఆవేశమును రేఖామాత్రముచే రూపెత్తించగల్గిన అజంతాచిత్రకారుల కౌశలము వర్ణనాసీమ నతకరించి, అమరత్వమందినదిగదా! నానాత్వమందలి ఏకత్వము ననుభవించు భారతీయసహజసంస్కారమే ఆ గుహాలయందు మూర్తిదాల్చినది.

ఆ పిమ్మట నవతరించిన మొగలురాజపుత్రశిల్పములందు సునిశితమగు ఆకారసాదృశ్యము కన్పించును. ఈ మార్పు ప్రాంతీయమగు రీతిభేదముమాత్రమే. ఆ మార్పు గూడ అకారణమును, స్వచ్ఛందమును గాదని యెఱుగవలెను. బాబరు పాదుషానాటినుండి తద్వంశీయులీ దేశమునకు గొని తెచ్చిన చిత్రకళకు ఆకారవైశిష్ట్యము ప్రధానలక్షణము. సమూహచిత్రణమును, రూపసమ్మేళనమును దానికి రుచింపవు. సీమాబద్ధమై వెలుగులో గన్పించు రూప

వ్యక్తిని నిపుణముగా బరిశీలించి, సాదృశ్యము నెలుకొల్పుటయే దాని సంప్రదాయము. త్తైమూరు, చెంగిస్థానుల అస్థానములందు బుట్టి పెరిగిన ఆ చిత్రకళకు, మార్దవభావ లోలతలకు గాని వావి. ఒత్తికొని వచ్చుచున్న జీవనవేగపుటుద్వృత్తినే ఆ చిత్రకారులు తమ చిత్రములందు రూపెత్తించిరి. ఆ చిత్రకళయందు వ్యక్తిసాదృశ్యము నుతిమించిపోవుటచే, నా చిత్రములు వ్యక్తినిరూపణ (Portrait)మాత్రములై పోయినవి. అట్లయ్యు, ఆ నిరూపణకౌశల మద్భుతము గూర్చుచుండును. దేశములోనికి క్రొత్తగావచ్చిన యీ సంప్రదాయముతో ప్రాతసంప్రదాయము కలిసినది. ఈ యుభయ ధర్మములను జీర్ణించుకొన్న నూత్నసంప్రదాయము వెలసినది. అజంతాలోని మార్దవమునకు సమవిభక్తాంగ ప్రత్యంగ లోలనాదికము తోడైనది. పూర్వసంప్రదాయమందలి పారమార్థికదృష్టి లోపించి రాజకులాచారమర్యాదలును, వానియందలి ప్రసాదమాధుర్యములును రూపెత్తసాగెను. మానవబుద్ధి కందని అలోకసౌందర్యమును సాధింపనెంచిన పూర్వసంప్రదాయమున లోకాతీతత స్ఫురించెడిది. నూతనమైన మొగలు రాజపుత్రరీతియందు సంయమసారళ్యలభ్యమగు లోకాతిశాయిత ప్రత్యక్షమయ్యెను. మొదటిది ఆనంద పారవశ్యము; రెండవది నిశ్చలత్వము. అట్లయ్యు, ఆ నిశ్చలత్వమునందుగూడ పురానుభూతపారవశ్యము గర్భితమై కన్పించుచునేయుండును.

ఆకారగాంభీర్యమునకు, రూపకల్పనాసమృద్ధికి నిలయములైన దాక్షిణాత్య దేవాలయములను భారతీయసంగీ

తము స్మృతికి దెచ్చుచుండును. ఉత్తరదేశసంగీతమున గాంభీర్యము లోపించి ఊహాతీతమైన సౌందర్యము స్ఫురించును. కల్పనాసమృద్ధి లోపించినను గమకమును, సమ్మేళనశక్తిని అది పుడికిపుచ్చుకొన్నది. కళల నన్నిటిని పరస్పరవిరుద్ధములగు రెండు ధర్మములు పాలించును. అలంకార కాంతిసమృద్ధు లొక దానికి లక్షణములు; సారళ్యసంయమములు, బొదుపరితనము రెండవదానికి లక్షణములు. మొదటిది రూపకల్పనాసమృద్ధి యందును, వైభవమునందును రసజ్ఞుల నోలలాడించును. రెండవది అల్పపరికరముచే, శైలీనిగ్రహముచే సహృదయ హృదయాహ్లాదకమగును. మొదటిది వాచ్యముచేతనే రసస్పష్టి పారమ్యము నందజూచును. రెండవది పరిమితవాచ్యముచే అపరిమితార్థముల ధ్వనింపజేయును. మొదటిది తాను సాధించిన అర్థవైభమును గనులముందు నిల్పును. రెండవది అమేయమై మూల్గుచున్న అర్థరాశికి భావనాద్వారమును తెఱచును.

ఈ రెండురీతులును గూడి పూరుషార్థసిద్ధి నొనగూర్చును. సపత్నములగు నీ రెండు రీతులును సమపాళములై యొనగూడినచో కళాతపస్సు ఫలించును. ఈ రెండు ఆశయములకు గారణములగు జిత్తవృత్తుల రెంటి సమ్మేళనముచే బండిన సంస్కారము జీవనకల్పతరువే. భారతీయ సారస్వతరీతులు రెండు నిట్లు పొందిపొసగి, కళాలక్ష్మికి పెండ్లిపందిళ్లను, సంస్కార సౌధమునకు బైడినిచ్చెనలను గల్పించినవి.

# 3

# సృష్టి వైఖరులు

విజాతీయములగు రెండు సంస్కృతు లొండొంటి దలపడినపుడు ముందుగా బుద్ధియందు తర్కవితర్కములు పొడమును. కావున హిందూముస్లిము సంస్కృతుల ప్రథమ సంఘృష్టిచే దక్షిణదేశమున తత్త్వమీమాంస బయలు దేరినది. బుద్ధికి సమాధానముగల్గినపిమ్మటగాని చిత్తము దాని నంగీకరింపదు. బుద్ధికి, చిత్తమునకు సమాధానము గుదురుటకు కొంత వ్యవధి కావలయును. చిత్తమునకు సమాధానము కుదిరినచో నూతనసంస్కృతి ఆత్మయందు జొరబారును. ఆపిమ్మట మన నడవడియే వేఱగును. క్రమముగా రాగద్వేషములలో క్రొత్త పొడచూపి, కళాసృష్టి మున్నగు కర్మలయందు నూతనరీతు లావిర్భవించును. ఉత్తరదేశమున నీ రెండుసంస్కృతులకు చిరతరమైన గాఢపరిచయ మబ్బుటచే, అచటి కళలలో నీ రెంటి ధర్మములును సమన్వితములయ్యెను.

ఆలయప్రాసాదాది నిర్మాణములం దీ రెండుసంస్కృతులు నెట్లు మేళవించినవో చెప్పితిమి. వంగదేశమందలి వైష్ణవగీతములందుగూడ నిట్టి సమ్మేళనమే గోచరించును. నూతనకళారీతు లుద్భవించుట కనువైన పూర్వరంగము వంగదేశమున నెప్పుడును సిద్ధముగనే యుండునుగాన, ఇస్లాము ధర్మసంఘర్షణ మా పాలకడలికి మందరమై, వైష్ణవ గీతామృతము పొడమెను.

ముస్లిము ధర్మమందలి రజఃప్రవృత్తియు, మాయా వాదముచే జనించు నిర్లిప్తతయు—ఈ రెండును వైష్ణవగీతము లలో నద్భుతసమ్మేళనమును భజించినవి. హైందవేయుల కాజన్మసిద్ధమైన పారమార్థికదృష్టి వారికి గొంత వైరాగ్య మును, శాంతిని అలవఱచినవి. అట్లయ్యు, ఇస్లాము ధర్మా వతరణముచే వారిలో స్పర్థాద్వేషములు ప్రకోపించినవి. ఎంత మాఱొడ్డి నిల్చినను, హైందవుల ప్రతీకారములు వ్యర్థ ములై పోయెను. యత్నవైఫల్యముచే నిరాశయు, నౌదా సీన్యము జనించెను. ఆ వైరాగ్య మాత్మవిచారమునకు దారితీసెను. ఆ తత్త్వనిష్ఠ ఐహికైశ్వర్యములను మరపిం చెను. ద్వీపాంతరములను వశీకరించిన పూర్వుల వైభవ ప్రాభవములు కథలు, గాథలు నై పోయినవి. పురుషార్థ పరులై, సామ్రాజ్యము నేలిన భారతీయుల ప్రతిభాసము జ్వలత మాసిపోయి, మఱపుదగిలి, మధ్యయుగమునాటికి కావిరంగును, బూదిపూతలు మిగిలినవి. శాత్రవుల యాక్ర మణముచే నిట్లు వైరాగ్యము పుట్టుకొనివచ్చుట వింతకాదు. భారతభూమిని బ్రిటిష వ్లాక్రమించినపిమ్మట ముస్లిములలో గూడ నిట్టి వైరాగ్యమే పుట్టుకొనివచ్చెను. ఇహమందు వాటిల్లిన పరాభవదుఃఖమును మఱపించుటకు పరలోక సౌఖ్యములపై నాసయొక్కటయే పరమౌషధముగదా? "ఈ సంసారదుఃఖము లనిత్యములు; నిశ్శ్రేయసమే పరమ సుఖము," అనుకొనుటయే తారకమైనది.

ముస్లిముసంస్కృతి యల్లుకొనుటకుముందు హైందవ లోకము నలమికొన్న యీ యైహికనిర్లిప్తతగూడ నొక

మేలుకొలుపే యైనది. ఇహయాత్ర అనిత్యము గావున నిచటి దుఃఖములు మనస్సును బాధించుట మానెను. సంఘము నందు తమపాల బడిన నైచ్యము విధివశమని ప్రజలు తల యొగ్గిరి. సంఘదౌష్ట్యమునకు, అధర్మమునకు నెదురొడ్డక, పాపపుణ్యములు పురాకృతముపై ద్రోచి యూరకుండిరి. బ్రహ్మమే సత్యము, జగత్తు మిథ్య. జీవాత్మ పరబ్రహ్మస్వరూపుడే గావున అనిత్యములగు సంసారదుఃఖములు లా పర బ్రహ్మము నంటవు. సంసారమాయను గడచినంతనే జీవుడు దుఃఖవిముక్తు డగును. కావున నిత్యసుఖము నార్జింపదగును గాని అనిత్యములగు సంసారతాపములకై విచారింపదగదు.

ఇస్లాముధర్మసంఘర్షణముచే నీ వైరాగ్యము మూల మంట గదలిపోయినది. ఇస్లాము ఇహపరముల రెంటిని సరి తూచునుగాన నైహికసౌఖ్యము దానికప్రధానము గాదు. సర్వమానవసమత్వమును బోధించు నిస్లాముధర్మము సంఘమం దెచ్చుతగ్గుల నంగీకరింపదు. కావున లోకమున నితర సంఘవ్యవస్థలు, రాజనీతివ్యవస్థలు దాని ధాక కెదురొడ్డి నిలుచుట యరిది. మానవసమతాసౌదర్యము లిహమందే సాధింపదగినవిగాని పరలోకమందు గాదనుచు నిస్లాము ప్రభంజనవేగముతో వచ్చిపడినంతనే ఇచటి సంఘవ్యవస్థలు చలింపసాగెను. సంఘప్రాకారములు కూలి, ఆచారపాశములు సడలిపోయెను. ఇన్నాళ్లు సంఘమందు నైచ్యము ననుభవించుచున్న దీనులు, పతితులు ఇస్లాముధర్మమున కెదురొడ్డలు నెఱపి, దానితో జేతులుగలిపి దానికి విజయము గూర్చిరి. వ్యష్టికి నిత్యవ్యవహారమందు ఇస్లాముధర్మ మంగీక

రించు నీ సమత్వస్వాతంత్ర్యములే దాని ధాక నప్రతిహత మొనర్చినవి.

ఈయుభయధర్మసంఘర్షణ సమన్వయములకు వంగీయ వైష్ణవసాహిత్యమున గావ్యత్వము సిద్ధించినది. ప్రేమభావమే ఈ కావ్యములకు ప్రాణము. ప్రేమమున కవి యొనర్చిన వ్యాఖ్యానమే సాధుసమన్వయమును సాధించినది. ప్రేమము కేవల దైహికమును గాదు, కేవల మానసికమును గాదు. దాని నాంతరమగు ననుభవవిశేష మనుటకును వలనుపడదు. ప్రేమమందు దేహాత్మలకు ప్రబలమగు కాంక్షయు, దహ తహయు జనించును. వ్యష్టిసమష్టుల సర్జనశక్తి కది ప్రతీక. కార్యకారణవివేచనమున కందదది. దానిని జంతుధర్మమని త్రోసిపుచ్చలేము. భూతవర్తమానములను గుఱుతెఱిగిన జీవి అవేద్యమగు నేష్యముపట్ల నెఱపు సాహసమనిన అన వచ్చు దానిని. ప్రవృత్తిసారభూతమగు నా సాహసము ప్రశస్తమైనచో, నా ప్రవృత్తియు బవిత్రతరమగును. ప్రయో జనరహితమగుటచే ఆ ప్రవృత్తికి బంధము లంటవు. అది కేవలానందము. ఫలాభిసంధి లేని ఆ క్రియాశక్తి కేవలక్రీడ.

ప్రేమము నిట్లు తఱచినకొలది నది క్రీడామాత్రమని తేలును. వైష్ణవసాహిత్య మా క్రీడను లీల యనును. ఇద మిత్థమనరాని ఆత్మక్రీడయే ఆ లీల. క్రీడ యెంత పవిత్ర మైనను, శుద్ధసాత్త్విక ప్రవృత్తియే యగును. కాని వైష్ణవ లీలయందు నివృత్తిగంధ మున్నది. సాత్త్వికసంచారిభావా త్మకములగు రసావస్థలన్నిటియందు వైష్ణవకవి నివృత్తినే భజించును. ఆతనికి నాయికాత్వమేగాని నాయకత్వము

లేదు. ఆతడు భోగ్యమేగాని భోక్త కాడు. జీవునకు బర మాత్మయెడ బ్రపత్తిరూపమగు నీ సర్వార్పణబుద్ధి సమంజసమే యనిపించునుగాని జీవాత్మపరమాత్మల కీ నాయికా నాయకభావము సంకేతమాత్రమును, రూపకల్పనమునేకాని పరమార్థమందు సత్యము గాదు. అన్వేషణమందు గన్పించు నీ ద్వైతభావము సాక్షాత్కారమందు నశించును. భేద నాశమే ఆత్మదర్శనప్రాప్తి. భోక్తృభోగ్యభేదము లంతరించి, భోగమే నిలుచును. మాయామూలకమగు నీ భేదభావము వైష్ణవకావ్యములందు బూర్ణముగా నశింపక శుద్ధసాత్త్విక ప్రవృత్తియగు భక్తిలీలగా పరిణతినందినది. జగత్తు కర్మబద్ధ మనెడి విశ్వాసము చలించె ననుట కిది నిదర్శనము.

ఇహప్రధానమగు ముస్లిముదృష్టియు, హైందవుల పారమార్థికదృష్టియు మేళవించి, ఈ సమన్వయమును గుదుర్చుకొన్నవి. హైందవుల మాయావాదము వ్యష్టికి బ్రాధాన్యము లేకుండ జేసినది. వ్యష్టికి వ్యష్టికి భేద మాభాస మాత్రమే. సంసారదుఃఖముల నోర్మిమై భరింపజేసిన దీ మాయావాదమే. జన్మాంతరవిశ్వాసమునకుగూడ నదియే కారణమైనది. ఈ జన్మాంతరవిశ్వాస మొకవంక జీవులను బురుషకారహీనుల నొనర్చ, జీవులందరును బరమార్థమున నేకమే యను విశ్వాస మింకొకవంక వ్యవహారప్రత్యక్షము లగు భేదములను గమనింపకుండ జేసినది. క్రిమికీటకములు, పక్షులు, మృగములు, మనుజులు—నందఱు నాత్మయే యను మతమున మానవాధిక్యమును సాధించు పురుషకారమునకు దా వెక్కడిది? మఱి, యిస్లాముధర్మ మట్లుగాక మానవు

నె సృష్టి కంతటికి బట్టాభిషిక్తునొనర్చినది. ఈశ్వరునకుదక్క నితరుల కాతడు దలవంచడు. "పురుషుడే సర్వోత్తముడని యెఱుగుటయే పరమార్థ" మన్న వైష్ణవకవిసూక్తి ఈ ఇస్లాముధర్మమునకే జ్ఞాపకమగుచున్నది.

కథకులును, భిక్షాటకులగు గాయకులును భారతీయ సంస్కృతిని పామరలోకమునకు బంచి యిచ్చి రని మున్నే చెప్పితిమి. సంఘమం దన్ని యంతరములలో దత్త్వవిచారము వారివలననే పాదుకొన్నది. ముస్లిముల పంథీసాహిత్యము గూడ ఇందులకే పుట్టినది. హైందవకథకున కున్న సాధన సామగ్రి యపారము. రామాయణభారతాదు లాతనిపాలిటి నిధానములు. ప్రజలకు కథారూపమున హితబోధ చేయవలె నన్నను, వినోదము గూర్పవలెనన్నను ఆతడు తడవికొన నక్కఱ లేదు. భారతరామాయణములందలి యుపాఖ్యానము లాతని చేతి కిట్టె యందుచుండును. ఆ కథానాయకు లందఱు ప్రజలకు జిరపరిచితులు, నాత్మబంధువులు నై పోయిరి. హైందవధర్మములు గూడ వారికి గరతలామలకము లై పోయినవి.

ముస్లిముకథకున కిట్టి పురాణేతిహాసనిధులు లేవు. కేవల ధర్మోపన్యాసములు శుష్కములు. అవి చెవులకు నించవు, పొట్టలను నింపవు. ఈశ్వరమహిమలైనను ఉపాఖ్యానరంజితములు గానిచో వెగటుపుట్టించును. భారతాదులలో శృంగారవీరములే కాదు, హాస్యమే కాదు, ప్రజల కింపుపుట్టించి, సహృదయుల నొనర్చు కష్టసుఖాదిరూపములగు రసము లన్నియు నున్నవి; నీతిబోధకములగు పిట్టకథలు

నున్నవి. తనకిట్టి భాండారము లేదుగదా యని ముస్లిము కథకు డూరకున్నాడా? కావలసిన కథలు తానే కల్పించు కొన్నాడు.

ఈ కథాకల్పనకు గూడ అక్బరే మార్గదర్శకు డాయె నందురు. అంతకుమున్నే కొందరు ఆదారి త్రొక్కిరేమో? త్రొక్కిరే యందము. ఎందరు దారిత్రొక్కినను, కృతకృత్యు డైనవానికే తుదకు పేరుదక్కునుగదా! అది యటు లుండ నిండు. ఆస్థానపండితుడైన వీరబలునితో అక్బ రొకనాడు హిందూభారతమునకు బ్రతిగా ముస్లిముభారతము రచింపు మనెనట. పిమ్మట గొంతకాలము గడచినది. వీరబలునకు ఆస్థానమర్యాదలు జరుగుచునే యున్నవి. పారితోషికములు ముట్టుచునే యున్నవి. తుద కొకనాడు పాదుషా "భారతము నేమిచేసితి" వని యడిగెను. వీరబలు డంతట "చిత్తం. భారతంలో ద్రౌపది కైదుగురు భర్త లున్నారని మెలిన వారికి.విశదమేకదా! ఈ భారతంలో కథానాయిక కెందరు భర్త లుండాలంటారో, మన అస్థానంలో వున్నవారిలో ఎవ రెవరి నాభర్తలుగా చెయ్యమంటారో పాదుషా సెలవిస్తే పూర్తిచేస్తా" నన్నాడట.

ఇది కట్టుకథయే కావచ్చునుగాని కథలలో గూడ కొంత నిజముండును. హైందవకథకుల కున్న సామగ్రి తమకు లేదయ్యెగదా యని ముస్లిముధర్మబోధకుల కేర్పడిన స్పర్ధయే యీ కథకు మూలమై యుండును. కథల కున్న బోధనా సౌలభ్యమును గ్రహించిన ముస్లిముబోధకులు వెంటనే తాముసు గథలల్లదొడగిరి. రామలక్ష్మణుల సౌదర్యమును

హిందువులు కీర్తించుచుండిరిగాన దానికి ప్రతిస్పర్ధిగా ముస్లిములు హసేనుహుసేనులకు అమీరుహంసీఫా యనెడి సోదరుని గల్పించి, యాతని భ్రాతృభక్తిని ప్రచార సాధనముగా జేసికొనిరి. భీమార్జును లిరువురికి మారుగా ఆలీని సృష్టించిరి. రామభక్తుడగు హనుమకు ప్రతిగా గల్పించుకొన్న అమీరుడుమియాచేతగూడ సముద్రలంఘనాది సాహస కృత్యము లాచరింపజేసిరి. ఈ విధముగా హిందూ పురాణ గాథలకు ప్రతిగా గల్పించుకొన్న యీ పంథిసాహిత్య వీర గాథలు నేటికిని బల్లెలలో బామర జన సమూహమును రంజింపజేయుచున్నవి.

భారతభూమియంతట నిట్లు ప్రచారమగుచున్న యీ కథలకు మూలమందు భేదము లేకున్నను ఆ యా ప్రాంతము లందు నామరూపభేదములుమాత్ర మేర్పడినవి. క్రిస్టియను భూములందు గూడ పురాతనసాక్షను కావ్యములు జీససును రణరసికుడగు వీరవతంసముగా జిత్రించినవి. ఇట్లే భారత దేశమందును ప్రాంతీయభేదములనుబట్టి యీ ఐతిహాసిక గాథలలో గొన్నిమార్పులు కన్పించుచున్నవి. కథానాయకు డంతట నొక్కడే యైనను ఆయా ప్రాంతీయులు నాయక శీలాదికమందు ప్రకృతోచితముగా నించుకించుక మార్పు లొనరించుకొనిరి. వంగదేశపు దేశిసాహిత్యమందలి రామున కును, తులసీరామాయణమందలి రామునకును ఏకొంచెమో భేదము కన్పించును. వంగదేశపు గృష్ణునందుగూడ ఆ దేశ సౌరభము వాసించుచునేయుండును. అట్లే ముస్లిము దేశి సాహిత్యమందును ఈ ప్రాంతీయ భేదములు గన్పించును.

వంగ దేశపు పంథిసాహిత్యమందలి అనీారు హాజ్జా అచ్చముగా నా దేశమువాఁడే.

ఆయాప్రాంతముల దేశిసాహిత్యమందు సామ్యముల కంటె ఈ భేదములే మనకు ముఖ్యము. అచటి ప్రజల చిరతరాచార సంప్రదాయాదు లీ భేదములందు మనము గు_ర్తింపవచ్చును. ఇతరప్రాంతములందలి కథలకు వీరులగు రాజకుమారులు నాయకులుగా నుండ వంగ దేశపు గథలలో వణిక్పుత్రుఁడు నాయకుఁడుగా నుండును. ద్వీపాంతరముల తోడి యోడ బేహారమే ఈ కథలకు బ్రధానేతివృ_త్తము. సింధు దేశపు గథలయందుగూడ దఱి చిల్లే కన్పించును. ఈ రెండు దేశములందును బేహారమే ప్రజలకు జిరాభ్య_స్తమైన వృ_త్తి. సముద్రములమీాది ప్రయాణము, తుపానులు, ద్వీపాంతరములందలి వింతలు, విశేషములు, ద్వీపాంతర వ్యాపారముచే లభించు విపరీత లాభములు, ఓడ మునిగినపుడు సంసార్థములు కూలుటలు, ప్రవాసమునందలి కష్టములు, ప్రియుల వియోగములు — నివి యన్నియు నచటి ప్రజలకు నిత్యకృత్యములుగాన కథకు డాయావిశేషముల గూర్చి కథల నల్లి, ప్రజలను రంజింపజేయుట పరిపాటి యైనది. ఎన్నడు గాలుకదల్ప కింటనే బడియున్నవారు గూడ ద్వీపాంతర వ్యాపారసంబంధములైన యీా కథలువినుచు వీర కరుణాద్భుతరసము లనుభవించెడివారు.

తనకాలమున ఆయాప్రాంతములందు బుట్టిన విశేషములనుగూడ కథకుడు తనకథలతో గ్రుచ్చియె_త్తి చరిత్రకారధర్మమును గూడ నిర్వ_ర్తించుట కద్దు. ముస్లిముల

విజయముచే నగరములందును, రాజకులములలోనే కాక పల్లెలలోగూడ నెన్నియో వింతలు, విపరీతములు, విశేషములు పుట్టుచుండెను. వర్తమానకథావిశేషములచే బురాణగాథలను వ్యాఖ్యానించి, కథకుడు క్రొత్త యింపు సంపాదించెడివాడు. పూర్వధర్మములకు గాలానుగుణమగు నూతన వ్యాఖ్యలు చేయుచు, అస్థిరాచారములకు గళా ద్వారమున సుస్థిరత్వమును గూర్చెడివాడు.

భారతీయ సంస్కార పరిణామమున పరస్పర మేళనమంది ఇట్లు సమన్వితములైన హిందూముస్లిము సంప్రదాయాచారాదికముల నీ విధముగా నెంత చెప్పినను పారము ముట్టవు. సజీవములగు సంస్కృతులు రెంటికి ఘర్షణ యొదవినపు డొకదానిలో నొకటి యెన్నడును జీర్ణించి లుప్తమై పోదు. రెండు ప్రవాహముల కలయికచే క్రొత్త ప్రవాహముదయించును. అట్లు గలిసిపోయిన ఆ రెంటిని వేర్పఱచి చూపలేము. రెండు సంస్కృతులే కాదు; రెండు జీవులు సంగమించినపుడుగూడ క్రొత్తజీవి ఉదయించును. తలిదండ్రు లిద్దఱి లక్షణములు నా జీవియందు గన్పించినను ఆ యిరువురికంటె నాతడు భిన్నుడే. ఆ సంగమప్రభావ మట్టిది; దాని పరిపూర్ణత యట్టిది. తత్ఫలరూపమైన నూతనాకృతియందు ఉభయలక్షణ సర్వస్వమును మూర్తి చెందును.

మధ్యయుగమున భారతీయ సంస్కృతియు నిట్టి పరిణామమునే పొందెను. పురుషార్థముల స్వరూపమే మాఱిపోయెను. ప్రాతగాథలు క్రొత్తప్రాణము పోసికొనెను. సంగీతసాహిత్య శిల్పాదికమునం దుదయించిన నూతనదృష్టి

నింతకుమున్నే పరామర్శించితిమి. ఎంత చెప్పినను బూర్తి కాని విషయ మిది. ఈ మార్పు సర్వతోముఖము. ఈ సమన్వయమునం దేక దేశమైన నూతనభాషనుగూర్చి సాకల్యముగా విచారించవలె నన్నను ఈ రొక్క జన్మము చాలదు. సంగీతసాహిత్యములం దుదయించిన నూత్నభావ సంచారాదులను విమర్శింపదొరకొన్నను ఈ జన్మముతో నంతముగాదు.

ఈ సంపూర్ణసమన్వయస్వభావమే భారతీయసంస్కృతి నాదికాలమునుండియు సుపుష్టము, సజీవము జేసియుంచినది. ఈ నూతనసంస్కృతియందు సంగమించిన యుభయ సంస్కృతుల ప్రాణశక్తియే యింతటి సమన్వయమునకు గారణమైనది. రెండు జడపదార్థముల నొక్కచో జేర్చినను బరస్పరమేళన మందనేరవుగదా! ఈ పురాణభూమి యం దాదికాలమునాడే ఆవిర్భవించిన ఆత్మజిజ్ఞాసాగవేషణము లింకను సాగుచునేయున్నవి. సుపుష్టములగు విజాతీయ సంస్కృతు లెదురైనపుడు వాని నాత్మీయ మొనర్చుకొని నూతన జవసత్త్వములతో నీసంస్కారధార సాగిపోవుచున్నది. దేశకాలములు నానాటికి సంకోచము లగుచున్నకొలది నీ పుణ్యవాహిని యే నూతనతీరములు మెట్టనున్నదో? ఏ బున్నెల కెగయనున్నదో? భారతీయ సంస్కృతి యందలి ఈ నిత్యనూతనత్వమే దాని యఖండతను రక్షించుచున్నది.

# క్రొత్త బుగబుగలు

విజాతీయమును జీర్ణించుకొని, తనతో అన్వయించుకొను ఈశక్తి భారతీయాత్మకు మొదటినుండియు గలదు. ఇది తొలినాటి భిన్నవిశ్వాసములను, ఆచారములను సమన్వయించినది. మధ్యయుగమునాటి విరోధములను పరిష్కరించినది. భిన్నసంప్రదాయములం దవతరించిన సత్యములను గ్రహించి యొక్కమాలలో జొనిపినది. విజాతీయములగు సంస్కృతులిట్లు పరస్పరమేళనమంది, శబలా రమణీయము, సంపన్నమగు నిస్సమానాకృతి దాల్చినది. ఆ యాకృతి నింకను దిద్ది తీర్చుటకుగాబోలు, ఎన్నడు ననుకొనని క్రొత్తదెసనుండి వింతవింత వన్నె చిన్నె లెన్నియో వచ్చిపడినవి.

# 1

# పుటపాకము

భక్తులు, జ్ఞానులు నిట్లొకవంక భిన్నమతములకు సమన్వయము గుదుర్చుచుండిరి. ఇంకొకదెస, చాతుర్వర్ణ్యపు వాడియు నించుకంత తగ్గినది. మఱొకవంక అర్థనీతి రాజనీతులకుగూడ మొగలు పాదుషాల ఏల్బడిలో గొంతయూఱట చిక్కినది. ఇచటి ప్రతీపశక్తు లొండొంటిపై కాల్ద్రివ్వుట మాని, తాత్కాలికముగా నిట్లు సరితూగి, శాంత సంరంభములై యున్నతఱి, భారతరంగమున యూరపు ప్రవేశించినది.

ఇచట గుదురుచున్న సమన్వయ మొక్కనాటిలో తుదముట్టునది కాదు. కావున ఆ సరితూగుటయు దాత్కాలికమే యైనది. ఇరువంకల సరితూగుచున్న దినుసులలో దేని కించుక ప్రాధాన్య మబ్బినను, క్రొత్తగా మఱొక దినుసు వచ్చి ఏవంక వాలినను, ఆ వంకకు త్రాసు మ్రొగ్గిపోవుటకు సిద్ధముగానున్నది. అట్లు మ్రొగ్గినచో మఱి యది కుదుట బడుట దుర్ఘటము. ఇట్టిస్థితిలో వచ్చిపడినది యూరపు. యూరపు వచ్చిపడుట యన్నచో, నది సాధారణ విషయము కాదు. కళపెళ గ్రాగుచున్న భారతజాతి పుటపాకమున యూరపురాకతో నెన్నియో క్రొత్తదినుసులు వచ్చిపడుటచే నాపాకము పదనుతప్పినది. లోలోన దుకతుకలాడుచు దెరలి పాఱుచున్న చిరతరవిరోధములు, సమన్వయము లొక్క పెట్టున పైకుబికినవి. పర్వతాగ్రమున నున్న హిమప్రపాతముపై (Avalanche) దానిపట్టు తప్పించెడి తుదిరాయి పడి,

ఆది దొరలిపడసాగినది. ఆపాటు ఎప్పటి కెట్లు ముగియ నున్నదో!

తొల్లి క్రొత్తక్రొత్త జాతులు, భావములు నెన్ని వచ్చిపడుచున్నను భారతజాతిస్వభావ మెప్పటికప్పుడు పాకపు బదునుగానే యుండెడిది. కావుననే విజాతీయ మతాచార సంప్రదాయముల కన్నిటికి భారతదేశ మేకవాక్యత గల్పింప జాలినది. పడమటిదెసనుండి వచ్చిన యీ నూతన సంఘర్షణము తొల్లిటివానికంటె విలక్షణమగుటచే దానితో నట్టి పొత్తు కుదురదాయెను. అంతకుమున్ను నూతన ధర్మములను, సంప్రదాయములను వెంటగొని వచ్చిన వారందఱు నిచట ప్రాతకాపులై పోయిరి. ఇచటి యాచార ధర్మాదికములు వారికి విరుద్ధములైనను, ఇచట బాదుకొనియున్న సంప్రదాయముల కలవడి, ఇచటి అపారజనసముద్రమున దామును గలిసిపోయిరి. వారికతన నిచట నే కొంచెమో మార్పులు గలిగినను మొత్తముమీద చూచినపు డవి పొడకట్టక, కాలక్రమమున భారతీయతాప్రవాహమే నిండారి పాఱుచుండెను. ముస్లిములుమాత్ర మట్లు మునిగిపోక నిలువరించు కొనగల్గిరి. అట్లయ్యు, భారతీయసంస్కారముద్ర వారిని గూడ నితరదేశ ముస్లిములనుండి వేఱుచేయనే చేసినది. వారివలన భారతీయాచారములలో గూడ కొంత మార్పు వచ్చినను ఆ మార్పు నగరసీమలందే కాని జనపదములందు భారతజీవనస్రవంతి తొల్లిటివలెనే పాఱుచుండెను.

ఐరోపీయు లిచట ప్రాతకాపులై పోవుటకు వచ్చిన వారు కారు. భారతీయ సభ్యతాసముజ్జ్వలత క్రొత్తలో

వారికి కొంత మిఱుమిట్లుగొల్పినను వెంటనే వా రా మోహజాలమునుండి విడివడి, యది తమ్ము సోకకుండ దవ్వుల నొంటిమై నిలిచిరి. స్వస్థాన వేషభాషాదుల నుజ్జగింపక, భారతీయులతోడి పొత్తును బ్రయత్నపూర్వకముగా బరిహరించి బ్రదుకదొడగిరి. తనతో నిచ్చి పుచ్చుకొనుటయు, కూడిమనుటయు నొల్లని యిట్టి నూతనసభ్యత నింతకుమున్న భారత దేశ మెఱుగదు. ఒండొరులపొత్తు నొల్లక ఎవరికివారెంత కంచెలువైచికొని కూరుచున్నను ఆ సంబంధాభావము గూడ ఒకరీతి సంబంధము గాకపోదు. పాశ్చాత్యులు గట్టుకొన్న యీ మడి మడిగా నిలువగలుగునా! విడివిడిగా నుండవలెనని ఎంత ప్రయత్నించినను భారతదేశమునకు, యూరోపునకు సంబంధము కలుగకతీరదు. ఆదిలో వర్తకవ్యాపారాదులకొఱకే సంబంధ మొదవినది. సరకు లిచ్చి పుచ్చుకొనుటేకాని మనసు లిచ్చిపుచ్చుకొనుట లేదపుడు. కాని, యీ సంబంధమిట్లు శుష్కముగనే యుండజాలదు. మానవునకు కేవల మర్థమే కాదు, ఇతర పురుషార్థములు గూడ నున్నవికదా! కావున దేశకాలము లేకీభవించి, యీ యుభయజాతులకు ధర్మకామాదిసంబంధమునుగూడ క్రమముగా గల్పించెను. వర్తకముచేసికొని బ్రదుకనెంచి వచ్చిన వారికి విధివిలాసముచే ధరాపాలనమే యబ్బినది. ఆర్థిక బంధముతోపాటు పాల్యపాలకబంధముగూడ గల్గినది. కేవలార్థికబంధమునగూడ రాగద్వేషములు పొడచూపక మానవన్నచో, అర్థబంధమునకు రాచరికపుబంధముగూడ దోడైనపుడు హృదయబంధ మంకురింపకమానదు.

కృషి ప్రధానమగు గ్రామజీవనమునుండి భారత దేశము వాణిజ్యవీథులలో నడుగిడుచున్న తరుణముననగదా యూరపుతో నీసంబంధము గలిగినది! భారతీయ సంఘ వ్యవస్థలో నప్పటి కింకను కుటుంబమునకు ప్రాధాన్యము పోలేదు. అప్పటికే గాదు, ఇప్పటికిగూడ మన సాంఘిక వ్యవహారములలో గుటుంబమునకు, వ్యష్టికి ప్రాధాన్యము గన్పించుచునేయుండును. మన శౌచపద్ధతి జూడుడు. వ్యష్టి శౌచమున మన కొరులు దీటురారు. సమష్టిశౌచమున మనకు శ్రద్ధయుండదు. మన దేహము, ఇల్లు, వాకిలి శుచిగా నున్నచో జాలును మనకు. పరిసరము లెట్లున్నను మనకు బట్టదు. వ్యష్టిప్రధానములగు నిట్టి సాంఘికాచార మర్యాద లకు ఆలవాలమైన ఈ దేశములోనికి ధనమూల వాణిజ్య వ్యాప్తిచే సంకీర్ణత నందిన సాంఘిక మర్యాదలతో వచ్చి పడినది యూరపు.

యూరపుతోడి ఈ యపూర్వ సమాగమముచే భార తీయాచారాదులు మార్పునందక తీరదు. గతించిన రెండు శతాబ్దులలో అనుద్దిష్టమైన యీ మార్పు సడియు జప్పుడు లేకుండగనే జరగిపోయినది. తొల్లిటి ప్రామాణ్య బుద్ధి ప్రజలకు తొలగిపోయినది. వెనువెంటనే పూర్వపు బూరు షార్థములకు బూజుపట్టినది. సంఘనిర్మాణమే తారుమారై పోయెను. పదునెనిమిదవ శతాబ్దిలో సంఘమును శాసించిన కులములకు నేడధోగతి పట్టినది. 1774–వ సంవత్సరము నకు మున్ను వంగదేశమున విద్యయు, నర్థము, నధికారము ముస్లిములకు గైవసమైయుండెను. "సద్వంశజాతులైన ముస్లి

ములలో ఆనాడు నిరుపేదయు, నిర్వ్యాపారుడు మృగ్యు" లన్నాడు సర్ విలియం హంటరు. శ్వేబ్బదియేండ్లయినను దాటకుండగనే అది యెల్ల తలక్రిందై పోయెను. రెవిన్యూ అధికారమును ముస్లిములనుండి తప్పించి, వారన్ హేస్టింగ్సు హిందువుల కప్పజెప్పుటయే మొదలు. శాశ్వతసిస్తు నిర్ణయముతో (Permanent Revenue Settlement), ఈ నాముల పై హక్కు నూడలాగుటతో (Resumption Proceedings) ముస్లిముల నిప్పచ్చరము నిక్కమైనది. విద్యాప్రచారవిషయమున మెకాలే చేసిన ఆంక్షతో ముస్లిములయింట పేదరికము పీటవెట్టినది. ఈ మార్పును పరామృశించుచు ఆ సర్ విలియం హంటరే మరల నేమన్నాడు? "సత్కుల ప్రసూతులగు ముస్లిములలో సవ్యాపారతా సంపన్నతలు మృగ్యమైన" వన్నాడు. ఈ రెండుశతాబ్దులలో దాపురించిన విపర్యాసమునకీ యొక్క తార్కాణ చాలును. ఒక మతమ్మందని, ఒకదారియందనియుగాక సర్వతోముఖముగా సంఘటిల్లిన యీ మార్పుచే ప్రాతసదాచారములు, విశ్వాసములు శిథిలములు గా దొడగెను. ఆర్థిక సాంఘిక రాజనీతి వ్యవస్థలు శరవేగమున భగ్నముగాజొచ్చెను. వేయేల? భారతదేశమే పుటపాకమున బడినది. సంఘశరీరమున ఏనాడో కట్టిన పొరలకు పట్టు సడలుచుండెను. అపూర్వ లక్షణములతో క్రొత్తజాతులు బయలుదేరెను. మున్నున్న నానామతముల వాపునకు పాశ్చాత్య వీర క్రైస్తవము తోడయ్యెను. క్రైస్తవమిషనరీ తండములు బయలుదేరి, ప్రజలను క్రైస్తవమతప్రవిష్టుల జేయుచుండెను. అంతటి

వీలు కుదురనిచో క్రైస్తవధర్మమును మాత్రము ప్రచారము చేయుచుండెను. పాశ్చాత్యుల రజఃప్రవృత్తి కలపుసాలపులు లేవు. అది యన్నిటిని గీటురాతిపై నొరసి చూడసాగెను. ప్రజల యార్థిక వ్యవహారములే కాక చిరాగతములగు నాచారసంప్రదాయములు, విశ్వాసములు దాని పరీక్షకగ్గమై తలక్రిందులగుచుండెను.

పాంచభౌతికములగు ప్రకృతిధర్మములను మానవుడు నానాటికి వశీకరింపజాలుటగూడ ఈ సాంఘిక విపర్యయములకు దోడుపడెను. కడచిన నూరేండ్ల చరిత్రలో నిది యెంతయు గణనీయమైన విషయము. మధ్యయుగపు భారతదేశమున భిన్నసంస్కారములయు, సభ్యతలయు లక్షణమున కేకీభావము గల్పింపబడినది. 15 వ శతాబ్దికి బిమ్మట బయలుదేరిన క్రొత్తధర్మములను, సిద్ధాంతములను ఇందుకు దార్కాణలు. దక్షిణభారతమందుకంటె నుత్తరభారతమున హైందవాచారములకు బిగువు తక్కువ. ముస్లిము ధర్మసంపర్క ముత్తరమున నధికమగుటయే అందులకు గారణము. ఉత్తర దక్షిణభారతములకు గల యీ భేదము ముఖ్యముగా వర్ణవిభాగములందు గానవచ్చును. ఈ హిందూ ముస్లిము ధర్మములకు, ఎంత యత్నించుచునను, సమన్వయము పూర్తి చెందలేదని మున్నె చెప్పితిమి. దేశమునందలి వివిధభాగములు నొండొంటి కందుబాటులో లేకపోవుటయు, ఆచారపాశముల సహజదార్ఢ్యతయు నేకీభవించి, ఏకమును, పూర్ణము నగు అన్వయము గుదురనిచ్చినవి కావు.

పాశ్చాత్య ధర్మములతో, అర్థనీతితో సంబంధము

గలుగునాటికి ప్రాతికూల్యము తగ్గినది. దేశమునందలి వివిధ భాగములు నొండొంటికందుబాటులోనికి వచ్చి, రాకపోకలు సులభమయ్యెను. వివిధధర్మములు, సంస్కృతులు నొండొంటికి సన్నిహితములయ్యెను. భిన్నజాతులకు సంపర్కము సులభమై, తఱచయ్యెను. ప్రజ లంతకుమున్ను మతములు మార్చుకొన్నను ఆచారాదికములు మార్చుకొనెడివారు గారు. నే డన్ననో, మతమును విడనాడకుండనే, స్వమతాచారముల నుజ్జగింపసాగిరి. కావుననే నేటి భారతమున క్రిస్టియనులు సంఖ్యకు దక్కువైనను, క్రిస్టియను మతాచార ప్రాబల్యముమాత్ర మధికతరమై కన్పించును.

ఇస్లాముధర్మసంపర్కముచే, నగరవాసులైన శ్రీమంతులకు, రాచకొలమువారలకు ఐహికదృష్టి యలవడినదని చెప్పితిమి. ఈ నూతనదృష్టిచే యావత్సంఘస్వరూపమును గాకున్నను దాని వైఖరి కొంత మాఱజొచ్చెను. దేశ మతి విశాలమగుటయు, ప్రజలు పూర్వాచార సుస్థిరు లగుటయు నిట్టి మార్పులకు బ్రతికూలములైనను ప్రజల తొల్లిటి జడత్వమునకు మాత్రము భంగము వాటిల్లెను. క్రిస్టియను ధర్మము ప్రవేశించునాటికి బూర్వరంగ మిట్లు సిద్ధమైనది. క్రైస్తవధర్మమునకు ప్రజల సౌముఖ్య మెదుర్కొలు నెఱపినది. ప్రయాణసౌకర్యములు మున్నగువానిచే దేశకాలముల ప్రాతికూల్యము తొలగిపోయెను. ప్రజలకు కదలికయు, స్థానచలనమును బరిపాటియయ్యెను. కావున పాశ్చాత్యసమాగమ ప్రభావము నగరములలోనాగక, పల్లెలలోగూడ నడుగు పెట్టి, క్రమముగా ప్రజాకోటిని దన కౌగిలికి దార్పజొచ్చెను.

పాశ్చాత్యధర్మ మిట్లు భారతరంగమున కుఱికి, మల్ల చరచినందులకు, భారతము స్వతంత్రమై ఎదురు నిలిచినచో నీరెండు శతాబ్దులచరిత్ర మెటు లుండెడిదో! పాశ్చాత్య ధర్మమును పరిశీలించి, దాని సారాసారములను విమర్శించి, నిగ్గుదేల్చు స్వాతంత్ర్యము భారతమునకు లేకపోయినది. అట్టి స్వాతంత్ర్యమున్నచో నుభయధర్మ సుగుణములను భారతము మరల సమన్వయించి, లోకమునకు నూతన సభ్యతాభిక్ష నొసగెడిది. దైవ మన్యథా చింతించుటయే, భారతము పరాధీనత కగ్గమైనది. పాశ్చాత్యసభ్యతనుండి తన స్వభావ మున కనురూప మైనంతవట్టు గ్రహించి, ఇతరమును త్రోసి పుచ్చు స్వాతంత్ర్యమునకు భారతము నోచుకొన్నది కాదు. ప్రభువులు విధించినదాని కెల్ల దలయొగ్గినది. భారత క్షేమ మును జింతింపని ఆ ప్రభువులు తమ యర్థనీతికి భారత సంపదచే బరిచర్య చేయించిరి. భారతదేశము నిర్మించుకొన్న ఆర్థిక సాంఘిక రాజతంత్రముల సుస్థితికి భంగము గూర్చి, ఒక్కొకచో వానిని రూపుమాపిరి. అంతియకాని చిరాగత మగు భారతీయసంపదతో పడమటినుండి తెచ్చిన తృణమో, కణమో చేర్చి, క్రొత్తసమన్వయము సాధింప నుద్యమింప రైరి. ప్రాతది పోయినపుడు క్రొత్తపాత్ర ప్రవేశింపవలెను గాని రంగము శూన్యముగా నుండదు. అరగొరలు, నవిచా రితములు, కలగూరగంపలు నగు ఆచారలేశములు, ధర్మ కణములు రంగమున బ్రవేశించి, తాండవ మారంభించెను. నిష్క్రమించిన సనాతనధర్మము మఱి ప్రవేశింపదు. క్రొత్త ధర్మమున కింకను చూ లేర్పడలేదు.

# 2

# రెండు ముక్కలు

ఈ స్థితిలో మన పాలకులు తమ విద్యా సంప్రదాయము నిచట నెలకొల్ప నిశ్చయించి, ముప్పు దెచ్చిపెట్టిరి. తమ వాణిజ్య రాజనీతి ప్రయోజనములకొఱకై వారు చేసిన యీ నిశ్చయము సామాన్యముగా నంతటితో బోదనియు, విపరీతపరిణామమునకు దారితీయుననియు వారెఱుగరైరి. ఈ సంప్రదాయప్రతిష్ఠకు కర్తయైన మెకాలే దీని ఫలితము నొకింత యూహింపకపోలేదుగాని, బహుముఖమైన తత్పరిణామ మాతనికిని గోచరించినది కాదు. జడీభూతమైన భారతజీవనమున కీ సంప్రదాయముచే నించుకంత చైతన్యము ఘటించి పిమ్మట దానిని నెమ్మదిగా పాశ్చాత్యజీవన స్రవంతికి మలపికొనవచ్చు ననుకొన్నాడాతడు. పాశ్చాత్యవిజ్ఞానముతోడి యీ ప్రథమ పరిచయముచే మనలో నెందఱో ముగ్ధులైరి. ప్రాచ్యవిజ్ఞానభాండారమంతయు నొక్క యాంగ్లగ్రంథ పేటిక క్రింద దిగదుడుపని మెకాలేతో పాటు మనవారును నమ్మిరి. భారతీయుల బుద్ధులట్లు కరగించి, పడమటి మూసలలో పోతపోయవచ్చునని నమ్మిరే కాని మెకాలేకు, దత్సమకాలికులకు నంతకంటె దూరదృష్టి లేకపోయినది. దీనిచే మేల్కొన్న భారతీయాత్మ ప్రాచ్యపాశ్చాత్యములు రెంటికి సమన్వయమైన నూతన విచారధారకు దారితీయునని వా రూహింపలేకపోయిరి.

ఇంతకు నీ పాశ్చాత్యవిజ్ఞానము క్రొత్తదిగాదు మనకు.

అరేబియాపారసీకముల ద్వారమున, గ్రీకు విజ్ఞానముతో, నెనిమిదివందల యేండ్ల నుండి మనకు బరోక్షపరిచయము ఉండనేయున్నది. మూసలే పడమటివిగాని, భావము లవియే గావున, భారతీయులు మంచినీటి కెక్కిన చేపలవలె నీ క్రొత్త విజ్ఞానస్రవంతిలో మోకాటిబంటిగా విహరింపజొచ్చిరి. అదియునుగాక, హెలెను హెబ్రూపోగుల కలనేతయే కాని కేవలము పాశ్చాత్యముగా దీ క్రొత్త సంస్కృతి. అరబు హెబ్రూ సంప్రదాయము లొండొంటికి బ్రాతచుట్టములే. హెలెను విజ్ఞానసంపదయైనను యూరపుఖండమునకు అరేబియామూలమున సంక్రమించినదే. భారతీయుల దర్శనములను, తత్త్వమీమాంసలను అరేబియను లంతకు మున్నే తమ తత్త్వదర్శనములతో గలగలిపి, పశ్చిమఖండమున కందిచ్చిరి. ఈ కలగూరగంపనే గ్రొత్తయచ్చులలో బోసి, యూరపు మరల భారతదేశమునకు దెచ్చియిచ్చినది. ఇట్లు సంఘటిల్లిన ప్రాక్ప్రతీచీసమాగమముచే భారతదేశరంగమున ప్రాతబాట లొక్కొకటే మాసిపోయి క్రొత్తలు పొడమిన వన్నచో నక్కజమేమి?

ఈ పరిణామమునకు గారణభూతు లైనవారిలో క్రైస్తవమిషనరీలు, అధ్యాపకులు ముఖ్యపాత్రధారులు. ఆదిలో నీ మిషనరీలు భారతీయులను క్రైస్తవుల నొనర్చుటయే పనిగా బెట్టుకొనిరి. వీరి ప్రచారముచే బ్రజలు విమతప్రవిష్టులగుటకంటె స్వధర్మవిముఖులగుట అధికమయ్యెను. పైన వివరించినట్లు ఆర్థికముగా, రాజకీయముగా బూర్వరంగము సిద్ధమైయున్నదిగాన, ఈ మిషనరీలచెంతకు విద్యా

ర్థులై యేతెంచిన పడుచువాండ్రు వీరు బోధించిన పాశ్చాత్య విజ్ఞానముచే ముగ్ధులై, స్వధర్మముపట్ల శ్రద్ధను గోల్పోయిరి. పాశ్చాత్త్యుల యాచారముల నవిచారితముగ ననుకరించి, అవలంబింపసాగిరి. వారిలో గొందఱు శ్రుతి మించి రాగమునగూడ బడిరి; భారతీయమెల్ల బనికి మాలినదని యెంచి, చిరాగతములైన స్వజాతి సంస్కారములకు జేసేత నీళ్లువదలిన యా నాళ్ళలో ఎట్టి విపరీతములు పుట్టినను ఎవరు మాన్పగలరు ?

కాని, అవిచారితమగు నీ యంధానుకరణ మెన్నాళ్లని మనగలదు? పాశ్చాత్యసభ్యత సాధించిన విజయములచే దొలుత చకితులైన భారతీయులే, కొన్నాళ్ల కా వింత యొకింత ప్రాతబడినంతనే, దాతలనాటి తలపుబుంతలకు మరల జొచ్చిరి. పురాతనమును, భారతీయుల కభిమాన స్థానమునగు సభ్యత నొక్క పెట్టున జప్పగా నెవరు తుడిచిపెట్టగలరు? పాశ్చాత్య దేశము లొండొంటితో గలహించి కొట్లాడుటలు చూచినకొలది భారతీయులకు మొదటిమోజు చల్లవడెను. పాశ్చాత్యసంస్కృతితో బరిచయ మధికమైన కొలది దాని లోపములు దేటపడజొచ్చెను. వారి సాంఘిక రాజనీతిసంస్థల పస నానాటికి దెల్లమై, వారి యాధిక్యము మరుగువడసాగినది. పాశ్చాత్త్యులలో గొంద ఱుత్తమ సంస్కారులు ప్రాచ్యసంస్కృతికి క్రొత్తవ్యాఖ్యల నారంభించుటతో, నిన్నాళ్లును బ్రతీచి ననుకరించు భారతీయులకు గనువిప్పయ్యెను. ప్రాచీప్రతీచులు రెంటిని త్రాసులో నిడి, నిర్మమత్వముతో గొందరు వాని వాసిని నిర్ణయింప దొర

కొనిరి. క్రమముగా చరిత్రలను బరిశోధించినకొలది రెండు దిక్కులకు వారఘారు లంతరించెను. దేశకాలభేదమే కాని మానవబుద్ధి ప్రపంచ మంతట నొక్కతీరే యని తెలిసి వచ్చెను. అవిచారితముగ ప్రతీచి నారాధించుట మాని భారతీయులు సవిమర్శముగ దానికి విలువగట్ట నారంభించిరి.

పడమటి దంతయు బంగార మనుకొనెడి తొలినాటి పొంగు క్రమముగా జల్లబడెనుగాని, భారతజాతి జీవన పట్టము నీలోపల చెఱపివైచి మరియు జల్లనారెను. సనాతనములగు స్వధర్మములను మనవారు శంకించినందులకు గాదు – ప్రకరణమును బట్టి యవి ప్రస్తుతములగునో, కాదో పరిశీలింపదగినదే– కాని, ఈ పరిశీలనముచే సంఘైక్యమునకు భంగమువాటిల్లినందుకు వగవవలసివచ్చినది. కాలాంతరము లందు మన సంస్కారమున మార్పులు పుట్టకపోలేదు గాని, ఆ మార్పులు క్రమపరిణామములు గావున దాని ఏకత్వ మునకు భంగము లేకపోయినది. యూరపుల్తోడి ఈ సంఘర్షణముచే సంఘమంతయు మార్పు నందక, సంఘ ములో నెవరో కొందరు పాశ్చాత్యధర్మము నవలంబించి, మన నేలపై నొక చిన్న యూరోపును నిర్మించిపెట్టిరి. తక్కిన సంఘ మంతయు బూర్వాచారమునే అంటిపెట్టుకొని యుండ నీ కొలదిమందిమాత్ర మైరోపీయ సభ్యతకు దాసు లొగ్గి నిజ ధర్మాచారభ్రష్టు లైపోయిరి.

భారతీయసంఘ మిట్లు రెండు ముక్కలగుటకు, మెకాలే తెచ్చిపెట్టిన నూతనవిద్యాసంప్రదాయమే ముఖ్య కారణము. మన గ్రామ జీవనమున కనురూపమై మన

వర్తక వాణిజ్యములకు, రాచకార్యములకు జాలిన విద్యా సంప్రదాయము మన కుండనేయున్నది. దేశాంతరములందలి విద్యాసంప్రదాయముల కది యెందును దీసిపోవునదికాదు. చిరాగతము, సర్వార్థసాధకము నగు నిట్టి సంప్రదాయమునకు మనల దూరులనొనర్చి, ఆంగ్లప్రభువులు మనకించుకయు గొఱగాని విద్యాపద్ధతి నంటగట్టిరి. భారత సంపదను హరించుటకై వా రిట కేతెంచిరి. మన విద్య అందుల కక్కఱకురాదుగావున తమ పబ్బమును తొందరగా గడపి కొనుటకై, మన తల కీవిద్యను జుట్టబెట్టిరి. మనచేతనే తమ కార్యమును జక్కబెట్టించుకొనిరి.

భారతదేశముతో వర్తక మొనర్చి బాగుపడవలెనను నాసయే బ్రిటను నిచ్చటికి దొలుత దోడ్తెచ్చినది. రాచరిక మబ్బినపిమ్మటగూడ చాలకాల మీవర్తకమే వారికి బ్రథమ ప్రయోజనముగావున వారి రాజనీతి అర్థనీతికి బరిచర్యచేయ సాగెను. తమకు, భారతప్రజకు మధ్యవర్తిత్వము నెఱపి, భారతభాగ్యమును దమచేతి కందిచ్చు భారతీయులు వారికి గావలసివచ్చిరి. తాము ప్రవర్తింపజేసెడి రాజనీతి కనుగుణ ముగా, నిత్యవ్యవహారమున రాచకార్యములు చక్కబెట్టగల భారతీయులుగూడ వారికిగావలసివచ్చిరి. ఆంగ్లభాష నేర్చిన భారతీయు లీ యుభయకార్యములకు దక్షులగుదురు. కావున స్వప్రయోజనసిద్ధికై మనపాలకులు ఆంగ్లభాషాప్రధానమగు విద్యాసంప్రదాయమును మన కలవరచిరి. పురుషార్థదాయిని కాదగిన విద్య మన కా నాటినుండి ఆంగ్లభాషా పాండిత్య సంపాదనకుమాత్ర మక్కఱకువచ్చినది.

భాషాపాండిత్య ప్రధానమగు నీ విద్యచే నానాటికి విద్యాపరమార్థమే మూలబడక తప్పదు. మన దేశమున మధ్యయుగమునాటికే శిల్పాదిసాంకేతిక విద్యాప్రచారము లేదు. శిల్పాచార్యుల చెంతను, శిల్పసంఘములందును కులవిద్య లభ్యసించు పద్ధతిగూడ నానాటికి వెనుకబట్టెను. భారతీయ పరిశ్రమలను, వాణిజ్యమును మన పాలకులు క్రమముగా మట్టుపెట్ట దొడగిరిగాన, మనప్రజకీ వృత్తివిద్యలపట్ల అభినివేశము సన్నగిలెను. భాషాపాండిత్యపు రుచిమరగి, మనవారు హస్తకౌశలమును గోల్పోవుచుండిరి. కృషిప్రధానమగు మన యర్థనీతికి ఇంగ్లీషుభాషతో బనిలేదు. రాజోద్యోగులను, కంపెనీ గుమాస్తాలను శిక్షించుటకు బనికివచ్చు విద్యాపద్ధతి దొక దారియు, మన వ్యవసాయవాణిజ్యముల దింకొక దారియు నైపోయినది. తత్ఫలితముగా ప్రధాన పరిశ్రమయగు మన వ్యవసాయవృత్తి విద్యావిహీనుల పాలబడిపోయినది. కర్షకపుత్రుడు చదివికొన్నచో వ్యవసాయమునకు స్వస్తిచెప్పి రాజోద్యోగి యైపోవును. కర్షకులలో విద్యావంతులును, విద్యావంతులలో గర్షకులు మృగ్యులైరి. మన వృత్తికి, విద్యకు నిట్లు ఎడమొగము పెడమొగ మగుట సంపద్వినాశమునకు దారితీసెను. మన సంఘములో విద్యావంతులు, విద్యావిహీనులు నను ప్రమాదకరమగు క్రొత్త చీలిక యుదయించుట కిది కారణమై, మనకొంప దీసినది. భిన్నరాష్ట్రములకు, మతములకు నంతకుబూర్వమే యున్న స్పర్ధలకు ఈ నూతనవిభాగము తోడుపడి, నానాట విస్తరించి, మహానర్థహేతువగుచున్నది. ఇంతకు జదివికొన్నవారు,

చదివికొననివారు నను భేదమే తప్ప వీరిలో విద్యావంతు లెవరును గారు. ఈ దేశమున వట్టి వ్రాతకోతల కెన్నడు విద్యాగౌరవము లేదు. అక్షరజ్ఞానహీనులయ్యు, పరంపరాగత మగు సంస్కారముచే మనవారు తొల్లి విద్యావంతు లనిపించుకొనిరి. వట్టి వ్రాతకోతలకు పూర్వమందే లేని గౌరవము ఇంటికి జ్యేష్ఠాదేవియు, పరులకు లక్ష్మీదేవియు నగు నేటి ఇంగ్లీషుచదువున కెట్లు లభ్యమగును? భారత ప్రయోజనములకు కొఱగాని నేటిచదువు దేశవినాశన మంత్రము కాకతీఱదు.

పాశ్చాత్యగురుత్వము నంగీకరించిన యీ విద్యా వంతులకు బ్రదుకుదెరువు బ్రిటిషు ప్రభుత్వముతోడనే యున్నది. వ్యాపార క్షేత్రమున జక్కని రశ్మి యున్నను, అచట వసతులు తక్కువ, యొత్తిడి యెక్కువ. కావున రాజసేవను మించిన బ్రదుకుదెరువు మఱొక్కటి లేదు. అది యేనుగుపాడి. అందు నిలుకడకు నిలుకడయు నుండును. జీవికకై కొట్టుమిట్టాడు నితరుల దేవులాటతో బోల్చిచూచి నచో, రాజసేవకులది సుఖ జీవనమే యనిపించుచుండును. వారి కీ భాగ్యమును బట్టించిన దాంగ్లభాషాపాండిత్యమే కాని శీలసంపదయు, బ్రజ్ఞాప్రకర్షయును గావు. ఆపాటి భాషా పాండితి సులభసాధ్యమే కాని అది యేమి బ్రహ్మవిద్య కాదు. ఈ విధముగా నాంగ్లభాషాప్రవిష్టులైన సామాన్య గృహస్థుల సంఖ్య క్రిందటి శతాబ్దిలో విపరీతముగా బెరిగిపోయినది. ఈ విపరీతవృద్ధి ఫలితములను ముందుముందు వివరింతును. దీనిచే నొదవిన యొక యనర్థమునుమాత్ర మిచట బేర్కొని

ప్రకృతము ననుసరింతును. ఆంగ్లవిద్యనేర్చిన యీ మధ్య శ్రేణి సంసారులసంఖ్య నానాటి కిట్లు పెరుగుచున్నదే కాని వీ రాశించెడి యుద్యోగముల సంఖ్య అట్లే యున్నది. ఉద్యోగముల సంఖ్యకు, వాని కెగబడువారి సంఖ్యకు నేర్పడిన యీ వ్యత్యయమే నేడు భిన్నమతములకు, రాష్ట్రములకు మధ్య స్పర్ధను, కడుపుమంటను బుట్టించుచున్నది.

ఈ చదువు నేర్చినవా రందఱు గాలక్రమమున స్వధర్మదూరులై పోవుట ఇంతకుమించిన యనర్థము. చదివినవా రందఱును బల్లెలనుండి పట్టనములకు జేరి, చిరాగతమగు స్వస్థానవేష భాషాభిమానమును గోల్పోవ జొచ్చిరి. పల్లెలలోని కర్షక ప్రజాకోటి కీ క్రొత్త నాగరకు లీ కారణమున దూరులగుటతో పల్లెలకు, బట్టణములకు సంబంధము తెగిపోయినది. పల్లెల భాగ్యము తరలిపోవుటయే కాని, నగరముల భాగ్యము తదనుగుణముగా వృద్ధియగుట లేదు. పల్లెలకు, నగరములకు సంబంధములు, రాకపోకలు తగ్గుటతో నెవరిభాష వారిదై, ఒకరి కష్టసుఖము లొకరికి గాకుండ బోయినవి.

ఈ క్రొత్త చదువరు లందఱు భారత సంప్రదాయము లందు బెరిగినవారు కారు. వీరిది పడమటి చూపు. పడమటి చూపును గాదు; దాని ఆభాసమాత్రమే. లంగరునుండి విడివడిన పడవలవలె నిలుకడమాలిన వీరికి వాచాటతయు, కయ్యమునకు గాల్ద్రివ్వుటయు నలవడినవి. పూర్వము భారత ప్రజానీకము సమిష్టిభావబంధురమై యుండెడిది. కావుననే దైవికరాజకములగు విపర్యయము లన్నిటిని వారు

గడచి గట్టెక్కిరి. నేటికిని జానపదులకు చదువు సంధ్యలు లేకున్నను, ఆచారవిమూఢత్వము, పామరత్వము వారిని విడువకున్నను ఈ సమష్టిభావ మింకను నశించిపోలేదు. ఈ యాచారస్థిరత వారికి అచలత్వమును సంపాదించి పెట్టినది. ఆ యచలత్వము కష్టసహిష్ణుతకే కాని పురోగమనమునకు గాకుండబోయినది.

భారతదేశమున నేడిట్లొకవంక స్వస్థాన లబ్ధమగు పుష్టి యుండియు, పురుషకారహీనమగు పామర లోకము వసించుచున్నది. జిజ్ఞాసువులు, నస్థిరులు, నాతురులు నగు విద్యావంతు లింకొకవంక స్వప్రజాదూరులై, భారతజీవన ప్రవాహమున నోడకొయ్యలవలె దేలియాడుచున్నారు. ముందున కేగవలయునని కోరికయున్నది గాని విఘ్నవికృతులను దాటిపోదగిన పిండశక్తి లేదు వీరికి. ప్రజాకోటియు, వీరును జేతులు గలిపినచో ఒండొరుల లోపములు చక్క బడ్డను. మఱి నేటి విద్యాపద్ధతి ఉభయుల నట్లు గ్రుచ్చి యెత్తుటకు మారుగా ఒకరి కొకరిని దూర మొనర్చుచున్నది.

## 3

# దేశప్రయుక్త జాతీయత

బ్రిటిషువర్తకనీతితో పాటువారిజాత్యభిమానముగూడ నిటకేతెంచెను. తొలినాళ్లలో నిచటికి వచ్చిన ఐరోపీయులు భారతీయులతో గలిపికోలుగా నుండెడివారు. క్రమముగా నదియెల్ల పోయి, శరీరములు దగ్గరగా నున్నను ఉభయ జాతులకు మనస్సులు దూరమగుటచే,పరస్పరము సంబంధము

తెగిపోయినది. ఇంగ్లండు ఒకవంక నీదేశములో రాకపోకల సౌకర్యము లొనదృచుండెనేకాని ఆంగ్లేయులుమాత్రము భారతీయము నంతటిని దూరముగా బరిహరింపసాగిరి. వారిట్లు ముడుచుకొనిపోవుచున్నకొలది భారతప్రజయు వారికి దవ్వైపోవుచుండెను.

ఆదిలో వచ్చిన ఐరోపీయులు భారతీయతకై ప్రాకులాడెడివారు. అట్లే కొందరు భారతీయులుగూడ బ్రిటిషు మోహమున బడి ఆదెసకు ప్రాలుచుండెడివారు. క్రమముగా బ్రిటిషుప్రజ, దూరముగా, దానొకతెగయై మడిగట్టుకొనియుండసాగెను. వెంటనే భారతీయులుగూడ బ్రిటిషుపొడ సోకకుండ మెలగజొచ్చిరి. తన యింట నొంటరిగా దినుచున్నపుడుగూడ నాంగ్లేయుడు విందుకేగుచున్నట్లు సింగారించుకొనునని భారతీయులును, భారతీయు లింద్రియములను నిగ్రహించి బొందితో కైలాసమేగుదురని ఆంగ్లేయులు నొకరినిగూర్చి యొకరు విపరీతముగా జెప్పికొనసాగిరి. పరచింత యొకరికి, ఇహచింత యొకరికి ప్రధానమనుకొనుట పరిపాటి యయ్యెను. మాది ప్రత్యేకజాతి యనెడి అభిమానము బ్రిటిషర్లకు బెరిగినకొలది, తాము ను బ్రత్యేకజాతి యని భారతీయులకును అభిమానము ముదిరిపోయెను.

బ్రిటిషుజాతియు, దత్సంస్కృతియు సాటిలేని వనెడి యహంకృతియే భారతజాతి స్వర్గమునుండి దిగివచ్చిన దనెడి యభిమానమునకు గారణమయ్యెను. బ్రిటిషురాజతంత్రమే మన సంపద్వినాశమునకు గారణమని పూర్తిగా తెలిసిన

పిదప స్వదేశముపై నభిమానము భారతీయులకు బుట్టుకొనివచ్చెను. భారతీయమెల్ల బనికిమాలిన దనెడి తొంటి భావము పోయి, మనది యంతయు మేలిమిబంగార మనెడి మూఢభక్తి జనించెను. భారతీయము లనెడి దురభిమానము కొలది ప్రాతవానినెల్ల ద్రవ్వి, తలకెత్తుకొనుట తోనే సరిపోవుచున్నదిగాని మన కింకను యథార్థమైన పునరుజ్జీవనము (Renaissance) లభింపకున్నది. రాజనీతిని, మతమును, సాంఘికమూఢాచారములను గ్రుచ్చియెత్తెడి యీ జాతీయతాభిమానము శాస్త్రబుద్ధులకు రిచ్చపాటొదవించుచుండును. పాశ్చాత్యులచెంత మనము నేర్చిన యీ జాతీయతాభిమానము తుదకు పాశ్చాత్యమైన సర్వముపై రోతపుట్టించుటకు గారణమైనది. పాశ్చాత్యానుకరణమే సర్వార్థసాధకమనుకొనుట వెనుకబట్టి, పడమటిదెల్ల పనికిమాలినదై పోయినది. ప్రధానవిషయములపట్ల నశ్రద్ధయు, అప్రధానములగు బాహ్యవిషయములపట్ల శ్రద్ధయు ప్రబలినవి.

పరభూముల నాక్రమించి, సామ్రాజ్యములు నెలకొల్పెడి ధనమూలవాణిజ్యమే జాతీయతాభిమానమును గూడ బెంచును. ఉత్పత్తిసాధనములు వ్యక్తులకు హస్తగతములగుటయే ధనమూలవాణిజ్యమునకు ప్రాతిపదిక. వ్యక్తివ్యాపారమున వస్తూత్పత్తి లాభముకొఱకేకాని ప్రజ కుపకరించుటకు గాదు. లాభదృష్టి ఉత్పత్తిని పెంచుచుండును. ఉత్పత్తి పెరిగిన కొలది దానిని విడుదలచేసికొను మార్గము లరయవలసియుండును. విడుదలకోసమై సర్వదేశ విపణులు గుత్తకు గైకొనవలసియుండును. వ్యాపారము నిట్లు

గుత్తగొనుటకై పరదేశముల నాక్రమించి సామ్రాజ్యములు నెలకొల్పవలసివచ్చును. ఈ గుత్తవ్యాపారమువలని లాభ మంతయు పెట్టుబడిపెట్టిన ధనికులకే చేరును. ఇట్లు విపరీత లాభము లనుభవించుచున్న ధనికులయెడ నిర్ధనుల కీసు పొడమకుండజేయుటకై, మన దేశము, మన జాతి యను అభిమానమును బుట్టించి వారి కను గప్పవలసియుండును. ఐరోపీయజాతులలో నీవిధముగా బుట్టుకొనివచ్చిన జాత్యభి మాన మాయాజాతులలో నున్న ఆంతరద్వేషము లోరు లెరుగకుండ గప్పిపుచ్చును. ఈ జాత్యభిమానప్రచారమున ఆంగ్లేయుల దందెవేసిన చేయి. భారతప్రకరణమున నీ జాతీయతా ప్రచారము విడ్డూరములను దెచ్చిపెట్టెను.

భారత చరిత్రమును బరికించితిమేని మొదటినుండియు ఏకత్వసాధన కన్పించుచునేయుండును. ఈ యేకత్వలక్ష్యమే ఆదికాలమున భిన్నజాతులను, సంస్కృతులను చాతుర్వర్ణ్య వ్యవస్థక్రిందికి గొనితెచ్చినది. జాతిభేదములను, దేశభేద ములను అతిక్రమించెడి ఏకధర్మము నట్లు సాధింపనేర్చిరి. దేశ మంతటిని యేకచ్ఛత్రముక్రిందికి గొనిరావలెనన్న యత్నములు జరిగినను, దేశవిస్తారతయు, రాకపోకల సౌకర్యములు లేమియు నందులకు భంజకములయ్యెను. తత్ఫలితముగా దేశకాలానుగుణమైన కృషిప్రధానార్థవ్యవస్థ యేర్పడినది. ఆ వ్యవస్థనుండి సర్వకార్యదక్షమైన గ్రామ పాలనము, నిస్సమానమైన పంచాయతియు బొడమినవి. కాగా, భాషాసాహిత్యములలో, ఆచారసంప్రదాయములలో, కళలలో, ధర్మమీమాంసలలో ఐక్యము కుదిరిన దేశాని

ఏకచ్ఛత్రితమైన రాచరికము నెలకొన్నదిగాదు.

ఇంచుకంత మార్పు లటనట గోచరించినను మధ్య యుగభారతముగూడ దీనికిబునరుక్తిప్రాయమే. ఏకచ్ఛత్రము కొఱకై యత్నము లానాడును జరగినవి. పూర్వపు చాతు ర్వర్ణ్యము వృత్తి విభజనగా మారినది. ఆచారములును మార్పుజెందినవి. కళలలో క్రొత్తరీతులు పొడమి క్రొత్త యేకత్వమును సాధించినవి. వేషభాషలు, సంప్రదాయములు మాఱిపోయినవి. ధర్మభేదములు, తత్త్వవిచారణ వివాదలు నూతనసమన్వయ మందినవి. భారతజీవన ప్రవాహమునకు బోటుదగిలి, క్రొత్తచైతన్య ముదయించినది. ఏకత్వలక్ష్యము మాత్రముపూర్ణసిద్ధి నందినదికాదు. సంస్కారసమ్మిశ్రణము జరగినదిగాని ప్రజాకోటులు దానిలో కరగిపోలేదు. భిన్న తత్త్వములను గూర్చిపట్టుటయే యైనదిగాని పరస్పర మవి మగ్నతచెందినవికావు.

భౌగోళికదృష్ట్యా భారతమంతయు నేకఖండము. అయ్యు ఏకచ్ఛత్రముక్రింద దాని నిముడ్చుట దుర్ఘట మయ్యెను. ఏకపాలనము లభించినపు డెల్ల దేశములోపలను, వెలుపలను శాంతి లభించుచునేయుండెను. దేశమును విభ జించి, స్వతంత్రరాజ్యములు నెలకొల్పు యత్నము లన్నియు భగ్నమైనవి. ప్రకృతిసిద్ధములైన యెల్లలను బెంచు యత్న ములకు నట్టిగతియే పట్టినది. ఒకప్పుడు దేశము బహుధా విభక్తమగుటయు, మఱొకప్పుడు హద్దులుమీఱి పెరుగ జూచుటయు నను నీ రెండవస్థలమధ్య భారతదేశ చరిత్ర మూగులాడినది. దేశకాలధర్మములు రెండు నేకీభవించినపు

డెల్ల ఊగులాటకు దక్కి శాంతిననుభవించినది.

రాకపోకల అసౌకర్యము దేశకాలధర్మములను వశీకరించుటకుమున్ను అడ్డువచ్చినది. నేడు రైళ్లవలన దేశమునందలి దూర విభాగములు చేరువకు వచ్చినవి. దేశమంతటిని రైళ్లు ఒక్క యినుపకట్టున బంధించినవి. మోటారుబండ్లు రైలుబండ్లకు దోడైనవి. నేడు ఆకాసయానములు వచ్చి, దూరములను మొదలే మ్రింగివేసినవి. ఈ కార్యమునే పోస్టు, టెలిగ్రాఫు, టెలిఫోనులు మఱొకవిధముగా జక్కబెట్టినవి. ఈవిధముగా దేశకాలధర్మములు నేడు ఒక్క త్రాసున దూగుచున్నవి.

భారతదేశ చరిత్రమున, ఈనాటికి, ఏకపరిపాలనానుకూల్య మేర్పడినది. ఆంగ్లేయు లాక్రమించుటచే నొదవినది గా దీ యానుకూల్యము. దేశకాలధర్మములను వశీకరించిన నేటి భౌతికశాస్త్రజ్ఞానమే లేకున్నచో బ్రిటను చేయగలిగినది లేదు. బ్రిటిషుపాలకులుగూడ తొల్లిటి ప్రభువులతో పాటే అయ్యేడివారు. ఈ నూతన సౌకర్యములు వారికి తమ దేశముతో సంబంధము తెగిపోకుండ నిలిపిపెట్టినవి. ఇంత దూరమున, బరదేశమందున్నను, వారికి తమభూమి యందున్నట్లే యుండెను. కావున వారిచటి ప్రజతో గలసిమెలసిపోక విడిగా నుండనేర్చిరి. అందువలననే రాజ్యపాలనాధికారమును తమ హస్తములందు కేంద్రీకృత మొనర్పగల్గిరి. పూర్వప్రభువులు తమ కందుబాటులో నున్న మేరనే ప్రభుత నెరపిరి. నేడట్లుగాదు. ఒక్కచో గూరుచుండియే ప్రభుత్వయంత్రము నేల నాల్గుచెరగులను శాసింప

జాలును. ఎంతటి విదూరభూములనేనియు నందుబాటునకు దెచ్చు నాధునిక శాస్త్రపరికరములే నేఁడు భారతభూపాలనము నేకముచేయుటకు, చేయగల్గుటకు గారణములు, సాధనములు నయ్యెను. రాజ్యతంత్రమునఁగూడ భారతమునకు నేఁడిట్టులైక్యము లభించుటచే ఏకజాతీయతగూడ మేల్కొనఁగల్గినది.

భారతదేశస్థు లెల్లరు నేకజాతి యను భావము మున్నెన్నఁడు లేదు. ఏకసంస్కృతివలన నేర్పడిన ఐక్యమే కాని ఏకపాలనముచే జనించు నేకీభావము మున్నెఱుఁగము. తొల్లి మన కీయాధునిక యంత్రపరికరములును లేవు; నేటి ఏకజాతీయతాభిమానములు ఆనాటికి లోకమునఁ బొటమరించను లేదు. ధనమూలవాణిజ్యముతో బుట్టుకొనివచ్చిన వీ యభిమానములు. ఆ లాభసాటివ్యాపారము మన దేశమున బూర్ణావతారము దాల్చుటకు గాల మింకను బక్వము గావలయును.

ఈ యేకజాతీయతాభావముచే భారత చైతన్యమున, ముఖ్యముగా విద్యార్థులగు పడుచువాండ్ర హృదయమున మథన మారంభమయ్యెను. లక్కవంటి వారి మనస్సులం దేనూతనభావమైన నట్టె ముద్రితమగును. సంసారబాధ్యతలు తలపై బడినపిమ్మటగాని సంఘ యంత్రమున వారు జిక్కుకొనిపోరు. పాశ్చాత్యదేశచరిత్రములను బఠించి, ఏకజాతిప్రభుత్వములే ఆ దేశముల కంతటి యున్నతిని, వైభవమును సమకూర్చెనని మన పడుచువాండ్రు గ్రహించిరి. అట్టి ఏకజాతిప్రభుత్వము మన కెన్నఁడు లభించునా యని వారు విఱ్ఱవీఁగులూరఁజొచ్చిరి.

పాశ్చాత్యభావప్రచారమువలననే మనకు ప్రజాతంత్రముపై నభిమానము గూడ బలపడినది. ప్రజాతంత్రము మనకు క్రొత్తయని కాదు. ప్రజాతంత్రితమైన తొల్లిటి మన గ్రామపాలనము జగద్విదితమే. మన వర్ణవ్యవస్థ గూడ ప్రజాతంత్రచోదితమే. వృత్తివిభజనచే పురుషునకు సంఘము నందు వృద్ధికాముకత్వ ప్రయోజకత్వములకు వీలు కల్పించిరి. కాని కాలక్రమమున వర్ణము వృత్తిచేగాక జన్మముచే ప్రయుక్తమైపోయినది. ఇస్లాము దేశమునకు రాకమున్నే బౌద్ధమత మీ వర్ణదుర్గముపై గొడ్డలిపెట్టు పెట్టినది. బౌద్ధము దానిని రూపుమాపలేకపోయినను తన ముద్రను వేసిపోవుటచే సంఘవ్యవస్థ మార్పుచెందినది. ఆ మార్పు ముఖ్యముగా నీశాన్యభారతమున స్పష్టముగా నిలిచియున్నది.

ఇస్లాముధర్మము వచ్చినపిమ్మట భారతజాతి మూలమంట గదలబాఱుటచే నిచటి సంఘవ్యవస్థగూడ తారుమారైనది. ఉత్తరభారత మంతటను ఈ మార్పు జనించినది గాని, బౌద్ధధర్మప్రచారముచే నంతకుమున్నే ఈశాన్య భారతమున బట్టుసడలియున్న సంఘవ్యవస్థపై ఇస్లాము ధర్మము నల్లేరుపై బండివలె సాగిపోయి, అద్భుతమైన విజయమును సాధించినది.

అప్పటికిని ప్రజాతంత్రమున కీ దేశమున బూర్తిగా పట్టుచిక్కలేదు. నిర్గుణమైన సర్వాత్మభావమును ధ్యానించెడి భారతమున జీవాత్మయగు పురుషునకు ప్రాధాన్యము లేదు. భారతీయ తత్వమీమాంసలకు, ధర్మములకు, కళలకు, అన్నిటికిగూడ జీవాత్మను బరమాత్మయం దనుసంధించుటయే

లక్ష్యమైపోయినదిగాన సంఘమందలి వ్యత్యాసములు వారికి బట్టవు. పరమాత్మ కీ జీవాత్మభావము నేడుండి వెల్లి పోవునదిగాన ఇచటి అనిత్య కష్టనిష్ఠురములు దానిని బాధిం పవు. భారతీయచిత్రలేఖనమునగూడ వృక్షసామాన్యమును జిత్రింతురేకాని విశిష్టవృక్ష లక్షణములను జిత్రింపకుండుట కిదియే హేతువు. మానవరూపచిత్రణముగూడ జాతిమాత్ర స్ఫోరకమేగాని విశేషలక్షణసంపన్నము గాదు. భారతీయ తత్వశాస్త్రము విశేషమును, సామాన్యమునకు వికృతి మాత్రముగా నంగీకరించును. కాగా, భారతీయదృష్టియందు జాతికేకాని వ్యష్టికి ప్రాధాన్యము లేదని ఫలితార్థము.

జీవవిశేషములపట్ల భారతీయులలో నెలకొన్న యీ యనాదరమే భౌతికశాస్త్రదృష్టి నిచట వికసింపనిచ్చినది గాదు. భారతదేశమున అమేయప్రతిభావంతులు, సత్య ద్రష్టలు జనించినమాట నిజము. ఆధునిక భౌతికశాస్త్ర సిద్ధాంతములుగూడ వారి ప్రతిభాదర్పణమున నీడలీనినవి. అయ్యు, నేటి భౌతికశాస్త్రదృష్టియు, మర్యాదయు నిచటి వారి కలవడినవి కావు. వ్యష్టిపట్ల అనాదరమే దీనికి గార ణము. వ్యష్టికి ప్రాధాన్యము లేనినాడు ప్రజాతంత్రము నుండజాలదు. కావున భారతదేశమున ప్రజాతంత్రము పెం పొందినది కాదు. పల్లెలలో, ప్రజల పరస్పరానుబంధముల మధ్య నిర్గుణవిచార మొకింత సగుణమగునుగాన ప్రజా తంత్రమున కచట చోటు దొరకినది. ప్రత్యక్షమగు నట్టి దృఢానుబంధములు లేనిచోట ప్రజాతంత్రము లక్ష్యమాత్ర మైపోయినది.

సర్వతంత్ర స్వతంత్రులైన సమ్రాట్టుల యేలుబడి యందుగూడ పల్లెలలో ప్రజాతంత్రమునకు భంగము వాటిల్లి నదికాదు. దేశవిస్తృతియే పల్లెల స్వతంత్రతను గాపాడినది. స్థానికముగా బ్రజ లనుభవించు ఈ స్వతంత్రత సామ్రాట్టున కభిమతమైనను గాకున్నను ఉపేక్షిత మగుచువచ్చెను. అట్టి స్వతంత్రతకు, సామ్రాజ్యమునకు విరోధ మేర్పడినపుడు సుశిక్షితములగు సామ్రాజ్య సేనలు సుసంఘటితముగాని ప్రజాభిమతమును నిర్జించుటయే జరగుచుండెను. కావున సువ్యవస్థితమైన ప్రజాతంత్రము పాశ్చాత్యులు పెట్టిన భిక్షయే. భూతపంచకవశీకృతిగూడ వారితోనే మనకు బ్రాప్తించినది. తన్మార్గములమున రాకపోకలు సులభమైనవి. ప్రజాతంత్రము రూపుదాల్చసాగెను. మున్ముందు రైళ్లవలన, ఆవల బస్సులమూలమున సమతాభావము వచ్చిపడి, జనపదములను జుట్టుముట్టెను.

## 4

# వైరుధ్యము

నిరాకృతములై పోవుచున్న చిరాగతసంఘవ్యవస్థలు, నూతనాగతములై మురిపించుచున్న పాశ్చాత్య సభ్యతా వ్యవస్థలు చెరియొక దెసకు లాగుచుండ మన నూతన జాతీయత ఆ రెంటిమధ్య నూగిసలాడజొచ్చెను. ఈ డోలాందోళనచే గలిగిన సంశయాత్మత యువలోకము నెక్కువగా నలమికొన్నది. మన మిట్లు త్రొక్కటపడుచుండగనే లోక మప్పుడే జాతీయతాదశను దాటి ముందుకు

సాగిపోవుచుండెను. ఐరోపీయసభ్యత ఒక్కొక్కటిగా దాటుకొనుచువచ్చిన దశాంతరము లన్నియు మనల నొక్కసారిగా ముట్టడించినవి. మఘలో పుట్టి పుబ్బలో నూడిన మన ధనమూలవాణిజ్యము వలెనే మనజాతీయతయు, ప్రజాతంత్రమునుగూడ బాలారిష్టమువాత బడుచున్నవి. సంఘ సమష్టివ్యవస్థ అప్పుడే మనపై వచ్చిపడినది.

ధనమూలవాణిజ్యము ముదిరి, ప్రపంచవ్యాపారము గుత్తగొనజూచినది. గుత్తవ్యాపారముతో లాభముల పాలుపంపుల చిక్కులు బయలుదేరినవి. ప్రాచీనగ్రామజీవనమున అర్థవ్యవస్థ కిన్ని చిక్కులు లేవు. పొలముపాటు తండ్రిది, ఇంటిపాటు తల్లిది, బిడ్డ లీయుభయులకు జేదోడు. ఇట్లు వ్యవస్థితమైన కుటుంబమే సంఘమునకు సూక్ష్మరూపము. ఒక్కొక్క వృత్తినే నమ్ముకొని, కుశలత్వము సంపాదించిన కుటుంబము లన్నియు కులములు, గ్రామములుగా స్థిరపడును. ఎప్పటి కుటుంబవ్యవస్థయే ఆ కులమును, గ్రామమును పాలించుచుండును. వర్తకవ్యాపారములు ప్రబలినపుడీ కులములలో బరస్పరాశ్రయత్వము, ఏకత్వము బొడచూపును.

మొదటి ఐరోపాయుద్ధముతో ఆధునిక సంస్కృతి మూలముననే మోసము వచ్చినది. ధనమూలవాణిజ్యమునకు, జాతీయతకు గల సహజ వైరుధ్య మీయుద్ధముచే బైటబడినది. కుశాగ్రబుద్ధుల భావనావీథులలో నూతనాశయములు వెలుగజొచ్చినవి. రష్యాలో సంఘటిల్లిన సాంఘిక విప్లవముచే మానవుని చిరవిశ్వాసములు, ధర్మములు, నాచారములు గూకటివేళ్ళతో గదలబారెను. ఆ విప్లవముచే

సంఘవ్యవస్థ లెట్లు పరిణమించునో చెప్పజాలము. సొంత ఆస్తులకు, లాభసాటి బేరములకు ముప్పు వచ్చినది. ఏ యార్థిక వ్యవస్థయు వీని సామోదించు పాకము తప్పిపోయినది. గుత్తవ్యాపారమునకుగూడ నూరేండ్లు నిండినవి. దానివలన ప్రాప్తించు లాభమును వ్యష్టులు దిగమ్రింగుటకు బదులుగా, సంఘశ్రేయమునకు దానిని వినియోగించవలసివచ్చుచున్నది.

యువజనులు ధనమూలవాణిజ్యముపై బెట్టికొన్న యాస లన్నియు నా మొదటియుద్ధముతోనే మట్టిపాలైనవి. నిర్వ్యాపారత్వమును, క్షుద్బాధను దెచ్చిపెట్టిన ఆ యర్థ వ్యవస్థపై రోత జనించెను. భారతభూమిలో దలయెత్తిన ధనమూలవాణిజ్యము పూర్ణముగా వికసింపను లేదు; విశుద్ధమును గాదు. తత్ఫలితముగా మధ్యతరగతిసంసారులు బాగు పడుచున్నను, ఆ బాగునందు గూడ వృద్ధియు, నిలుకడయు గన్పించకుండెను. విద్యార్థిబాహుళ్య మీ మధ్యతరగతి నుండి బయలుదేరిన దేకాన, ఎప్పటికప్పుడు నిర్వ్యాపారభీతి వారిని వెన్నాడుచుండెను.

తమ సంపదకు గాలము సమీపించె నని మధ్యరకపు సంసారు లందఱికి దెలిసివచ్చినది. ఈ దేశమునందు వారి యవస్థ మఱియు శోచ్యమైపోయెను. ఇతర దేశములలో ధనమూలవాణిజ్యముచే మధ్యతరగతివారికి సంఘమునందు గొంత నిలుకడయేనియు జిక్కినది. ఇచటివారి కదియు నంతంతమాత్రమే యయ్యెను. ఇచటి యర్థతంత్ర రాజతంత్రములను జేజిక్కించుకొని కూరుచుండిన బ్రిటిషు పాలకులు మన పెట్టుబడివ్యాపారమున కడ్డుదగులుచుండు

టచే నది చక్కగా సాగినది కాదు. అట్లయ్యు, క్రింది తరగతులనుండి మధ్యతరగతి కెగబ్రాకుట మాత్ర మధిక మయ్యెను. అట్లు విస్తరించిన మధ్యతరగతిచే మన యర్థ వ్యవస్థకు దలబరు వెక్కువైనది. పై కెగబ్రాకినవారు మరల క్రిందికిదిగి, తొల్లిటి పొదుపరిసంసారములు సాగింపనొల్లరు. ఇంకను బైకిపోవ్రుదమన్న, వేయివిఘ్నము లెదురైనవి. ఇక నేమున్నది! ఆ త్రిశంకుస్వర్గము నిర్వ్యాపారతకు, నసంతృప్తికి నిలయమైనది.

ఆ యీ సందర్భములచే పడుచువాండ్రు హతాశులు, నారంభహీనులు గాదొడగిరి. అందఱికి సమానావకాశములను గల్పించి, న్యాయముగూర్తునని సమతామతము వారిని జేరబిలుచుచున్నది. తమ్మావరించియున్న సందర్భములను బరికించినచో, ఆ సమతాధర్మమునకు, వీనికి నేడె కేడ యనిపించుచున్నది. ప్రస్తుతావస్థకు, ఆ విదూరాశయమ్మునకు గన్పించు విరోధమును బరిష్కరించుటకు శక్తి చాలకున్నది. కావున యువకబాహుళ్యము నిస్పృహకు, నిష్క్రియత్వమునకు వశమై, బేలతనమును భజించి, వాచాటమై పోవుచుండెను. పురుషకార మే కొందఱిలోనో యుద్దీపించుచున్నది. ఇట్లు సంకీర్ణము, నపక్వము నగు భావ పరంపరలో దేలియాడుచున్న నేటి యువభారతమును ఏక జాతీయతాసమతాధర్మము లొకదిక్కునను, లక్ష్యహీనతా నిస్పృహ లొకదిక్కునను ఉయ్యాలలూపుచున్నవి.

పదనైన క్షేత్రమున బడిన విత్తనములవలె నీ యసంతుష్టియు, నస్థిరత్వమును దేశ మంతట నల్లుకొనిపోయెను

గాని, కొన్నాళ్ల పాటవి నేలలోనే డాగియుండెను. పాశ్చాత్య విద్యయే సర్వార్థసాధకమని కొన్నాళ్లు కనులు మూసికొని దాని నారాధించితిమి. ఆరాధకులసంఖ్య పెరిగినకొలది ఆ భ్రాంతి తొలగిపోయినది. ఆంగ్లము నభ్యసించినవా రందఱను భరించి, సంపదనిచ్చుటకు జాలినంత ఆర్థిక వసతి దేశమున లేదని స్పష్టమైనది. ఆర్థికవ్యవస్థను మార్చుద మన్న నన్నియు నాటంకములే. మన కనులముందరనే చల్ల చల్లగా నాశనమైపోయిన మన పరిశ్రమ లపుడు జ్ఞప్తికి దగులసాగెను. ఆంగ్లభాష నేర్చిన నిర్వ్యాపారుల సంఖ్య పెరిగిపోవుచున్న దొకవంక. వ్యవసాయవృత్తిలో నప్పటికే యొత్తిడి ప్రబలిపోవుటచే క్రొత్తవారి నిక నది భరింప జాలదు. వ్యాధిలక్షణము లీరీతిగా నప్పటికి బైటబడెను.

దేశ మిట్లొకవంక నిప్పచ్చరమునకు నిలయమగుచు న్నప్పుడే సుఖానుభవ (Standard of Living) మధికము గావలయు నను కోరికగూడ దలయెత్తినది. చారిత్రక దృష్ట్యా చూచినచో నిది యుక్తమేయని తెల్లము కాగలదు. ఐరోపీయధనమూలవాణిజ్యము మన దేశమున నడుగు బెట్టునప్పటి కప్పుడే విజయయాత్ర కారంభించినది. భారత దేశమున దానికి గుదిరిన యానుకూల్యము, దొరకిన దోహదము మనకు ప్రస్తుతములు గావు. అర్థనీతి రాజనీతుల పరస్పర సంబంధముగూడ ప్రస్తుతముగాదు. ఇంగ్లండును భారతభూమికి గొని తెచ్చిన అర్థనీతిప్రాబల్యమే దాని కిచట అధికారపట్టముగూడ కట్టిపెట్టినదనుటయే మనకు ప్రస్తుతము.

భారత పరిశ్రమలకు శైశవావస్థ గడవకమున్నే, పాశ్చాత్యుల ధనమూలవాణిజ్య మూకొన్న పెనుభూతము వలె నెదురైనది. వ్యవసాయవృత్తికి దోడుగా బయలుదేరిన పరిశ్రమల నది నాశనమొనర్చి, భారతము నెప్పటి గ్రామజీవనమునకే మరలించినది. వ్యవసాయవృత్తి కిట్లు మరలించుటకు దోడుగా బలాత్కృతశాంతినిగూడ నీ దేశమున ఆంగ్ల పాలకులు నెలకొల్పిరి. అప్పటికే యున్నచిక్కులకంతట క్రొత్తచిక్కులు జతయైనవి. దేశములో నానాటికి ప్రజ పెరుగుటయు, సంపద తరుగుటయు దటస్థించెను. భూమి మాత్ర మెందఱినని భరించగలదు? వ్యవస్థా హీనమగు ననాగరకప్రజవలె, భూమిపైననే జీవింపుమని భారత సభ్యతను వెనుకమొగము పట్టించినట్లయినది. మఱి పాశ్చాత్యసభ్యతతో నొదవిన సంపర్కముచే క్రొత్తలోకమును, అనంతైశ్వర్యమును కనులయెదుట మెఱసిపోవుచున్నవి. వానిని జూచినకొలది తహతహయు, నంతస్తాపము జనించుచుండెను. పాశ్చాత్యుల యైశ్వర్యమును గనులార గాంచి, నానాటికి నిస్సారమగుచున్న తమ భూమిని గాంచినపుడు కడుపు దఱిగికొనిపోజొచ్చెను. రాకపోకల సౌకర్యములింతలో బ్రబలినవి. తొల్లిటి సంఘవ్యవస్థ తారుమారైనది. కావున నీ యసంతృప్తి దేశ మంతట వ్యాపించి వేరుదన్నికొన్నది. అంతట క్రొత్తయాలోచన లుద్భవించెను.

పాశ్చాత్యములైన నూతన భావములతో పాటుగా దారిద్ర్యముగూడ భారతభూమి నలమికొనుటవలననే ఈ యసంతృప్తిబీజములు నాటుకొన్నవి. రాకపోకలు సుకర

ములై, ఈ బీజము లంతటను వ్యాపించి వేరూనెను. భారతీయార్థికవ్యవస్థ తన యిచ్ఛమై మార్పుచెందు మార్గముల నాంగ్లేయు లరికట్టుటచే నా దుర్భరావస్థ యింకను విషమించెను. మొగలాయిప్రభువుల వీరమాన్యపద్ధతిని కాలక్రమమున సంతరించనిచ్చినచో భారతమున ధనమూల వాణిజ్య మవతరించి విస్తరించెడిది. పాశ్చాత్య ధనమూల వాణిజ్య మిచటికి వచ్చునాటి కిచట నున్న ప్రాత వ్యవస్థల నది మార్చుట మేలే యయ్యెను. అంతట నూరకుండక, తన క్షేమమునకై, అది యిచటి ధనమూల వాణిజ్యము నరికట్టక తప్పదయ్యెను. అ ట్లరికట్టుట కీడైనది. తన యభీష్టసిద్ధికై యిచట నది మధ్యతరగతి సంసారులను పెంచి, వారికి బుష్టిగూర్చినది. ఆ మధ్యతరగతివా రందరు నీ దేశమున ఆంగ్లేయుల సరకు లమ్మి, వారికి లాభము లార్జించిపెట్టి, తమ వంతునకు వచ్చిన తృణకణములతో ఎల్లప్పటికి సంతుష్టులై యుందురని నమ్మిన దది. తుద కా మధ్యతరగతివ్యాపారులే దాని పుట్టి నట్టేటిలో ముంచిరి. ఆంగ్లేయుల వాణిజ్యలాభములందే కాదు. వారి రాజకీయాధికారములందును, సంస్కారసంపదలందును భాగము పెట్టవలెనని మొండికెత్తదొడగిరి. ఈ తరగతివారు నానాటికి విస్తరించుచుండిరిగాన వారి కోరికలును, వారిఅసంతృప్తియు గూడ వా రమ్మిపెట్టెడి సరకులతోపాటు దేశము నలుదెసల నల్లుకొన్నవి. తుదకు భారతీయ ప్రజాజీవనమున నా యసంతుష్ట చిత్తవృత్తియే పీటవెట్టి కూర్చున్నది.

## 5

# నిత్యానిత్యములు

తలబరువుగా పెరిగిపోవుచున్న మధ్యతరగతి సంసారులతో భారతభూమి కింతింతనరాని చిక్కువచ్చినది. లోకమంతట నస్థిరత్వము, రంధ్రాన్వేషణము, అహంభావము నీ మధ్యశ్రేణికి సహజగుణములై పోయినవి. వారికి ఆర్థికముగా నిలుకడ యుండజాలదు. పెట్టుబడివ్యాపారుల మెట్టు కెక్కగోరుదురు వీరు. కాని, చాలమంది క్రిందిమెట్టుకే జారిపోయి, జనసామాన్యమున గలిసిపోవుదురు. గౌరవముగా గాలక్షేపమొనర్చుటకై ఆయమునకు, నెత్తునకు మించి వ్యయమొనర్తురు వీరు. అటు మీది కెగురజాలక, ఇటు క్రిందబడి యుండలేక ఒడుదుడుకులు పడుచుందురు గావున వీరి వైహికదృష్టి తదనుగుణముగా మారిపోవుట సాజము. నిలుకడ జిక్కిన శ్రీమంతునకు బూరుబారులు చెప్పికొని విఱ్ఱవీగ నక్కఱయుండదు. సామాన్యప్రజయు, తన భాగధేయ మీపాటియే యని యెఱిగి, అణగిమణగియుండును. మధ్యశ్రేణికే ఎవరికిని లేని విరుగబాటుతనము, నసంతృప్తియు, కంచుమ్రోతయు, గాల్దిగివ్రువ్వుటయు నలవడును. వీరు స్వప్రయోజకత్వమును సమర్థించుకొనుటకై పరుల దోషముల నుద్ఘాటించుచుందురు.

ఇతరుల రంధ్రములనే కాదు. ఈ మధ్యశ్రేణి సంసారులు తమ దోషములనుగూడ నుద్ఘాటించుచుందురు. నిజమునకు వీ రందఱు సజాతీయులు కారు. అట్టి సజాతీయత

వీరికే కాదు, సంఘమం దేశ్రేణియందును నుండదుగాని వీరిలో నున్న యంతరము లింకొక-చో గనరావు. అటు పెట్టుబడిదారులతో జేతులు గలిపెడివారు మొదలుగా, నిటు కష్టజీవులతో చెట్టులుపట్టువారు తుదగా నున్న ఈ మధ్య శ్రేణిలో నౌకరిమెడ నౌకరి కెంతటి యసూయ, ఎంత భయము, ఎంతటి మిడిసిపాటు! చెడబెరిగిన అహంకృతియే వీరి కొక వ్యాధియైపోవుచున్నది. మధ్యశ్రేణుల యీ వృద్ధి సంఘవ్యవస్థ మారనున్నదని సూచించును.

బహుముఖమైన యీ పాశ్చాత్యసంపర్కముచే మన సంఘవ్యవస్థ శీఘ్రముగ మాఱజొచ్చెను. అందు గొన్ని మార్పులను జూచి, తత్కారణముల దిలకించితిమేని, పరస్పర వైరుధ్యముగూడ గన్పించును. విజాతీయములగు పాశ్చాత్యసంఘవ్యవస్థలను జూచినకొలది మనవారికి తమ ఆచారసంప్రదాయములందు ప్రామాణ్యము సడలిపోవుచుండెను. పూర్వమందుగూడ క్రొత్తక్రొత్తజాతు లీ దేశమునకు వచ్చినపుడు మన యాచారాదికములు నూతన సమన్వయము నందుచునే యుండెను. పూర్వాచార పరాయణు లిట్టి మార్పులకు, అన్వయములకు నెదురొడ్డుటయు గద్దు. యుద్ధములు మున్నగు పరపీడ లొదవినపుడెల్ల భారతీయసంఘము ఆత్మరక్షకై కవచ మొనర్చుకొనుచు వచ్చిన పూర్వాచారములే ఆ సంఘశరీరమున బెరడుగట్టెను. దేశకాల నిమిత్తములు మార్పుగోరుచుండ, బూర్వాచారము వలదని యడ్డుపెట్టుచుండెను. సంఘశరీరమున నీ విధముగా చైతన్యజడత్వములకు బోరాటము పొసగెను. రాకపోకల సౌకర్యములు

లేని దినములలో జడత్వముదే పైచేయి యగుచుండెనుగాని ఆ సౌకర్యము లేర్పడినపిమ్మట దాని యాట సాగినది కాదు. సరకులతోపాటు భావములకుగూడ ప్రచారము లభించుటచే సంఘపరివర్తనము చఱచఱ సాగిపోజొచ్చెను. పట్టణములు పల్లెలకు సన్నిహితములయ్యెను. సంశయోపహతములై, పూర్వాచారానువర్తనమునకు దవ్వై క్రొత్త దారులు త్రొక్కజూచు నగరసీమలకు, ఆస్తికత్వముచే నిశ్చలములై, పూర్వాచారపరాయణములగు జనపదములకు నిట్లు సాన్నిహిత్య సంబంధము లధికమగుటచే పూర్వ సంప్రదాయసంతుష్టికి భంగము వాటిల్లెను.

పొట్టకూటికు దేవులాట లధికమైనకొలది తొంటి నమ్మకమును, సంతుష్టియు హరించిపోజొచ్చెను. కడుపులోని చల్ల గదలకుండ కాలక్షేపమొనర్చుట వెనుకబట్టినది. కులవృత్తులతో సంసారము గడచుటలేదు. అన్ని వర్ణములను, కులములను క్రొత్తక్రొత్తవృత్తులు చేరబిలుచుచుండెను. స్వగత భేదములను బాటింపని నాగరజీవనమున భిన్నకులములకు సహవాస సంసర్గములు సులభమయ్యెను. ఈవిధముగా నడియు నప్పుడు లేని విప్లవము మనము చూచుచుండగనే రూపెత్తుచున్నది. పూర్వపు విధినిషేధములు గాలిపాలగుచున్నవి. భారతీయ సంఘవ్యవస్థకు మూలభిత్తికమైన చాతుర్వర్ణ్యమునకే ముప్పుమూడినది. కలిమిలేముల తొల్లిటికొలతలు కల్లలైనవి. బాహ్యములైన యీ పరివర్తనలు మానసిక పరివర్తనమును దెచ్చిపెట్టెను.

పాశ్చాత్యసంపర్కము మన వ్యవహారవర్తనముల

గూడ మార్చి వేసినది. శాస్త్రవిశ్వాసముచే జనించిన జ్ఞానము మనది; పాశ్చాత్యులది అనుభవసిద్ధము. భారతీయ తత్త్వ దర్శనముల వ్యావహారికదృష్టి మనల నెన్నడో విడిచిపెట్టినది. ముస్లిముల హేతువాదముగూడ నిచటి గాలికి చల్లబడి పోయినది. పాశ్చాత్యదర్శనములకు దృశ్యమానజగత్తే విషయము. ఈ దృశ్యములకు గొలతలువెట్టి, పరిశీలించి తెలిసికొని, వశీకరించుటయే వాని పని. ఇంద్రియగోచరముగానిది వారికి లేనట్లే; ఉన్నను దాని జోలి వారికి బట్టదు.

భారతీయుడు నిత్యవస్తువిచారములో దగిలియుండ ఐరోపీయు డనిత్యముతో వేగుచుండును. భారతమునకు వర్తమానముతోడను, బ్రిటనుకు భావితోడను బని లేదు. ఆంగ్లేయుడు ప్రాప్తకాలజ్ఞుడు. ఎన్నడో రానున్న విపత్తు కొఱ కిప్పటినుండియు దిగులు చెందుట యాతనికి గిట్టను గిట్టదు; అంత తీరికయు లే దాతనికి. భారతీయుడు పూర్వపరములను విచారించుచు హెచ్చరికమై నుండును. రానున్న విపత్తులను బరిహరింపనెంచుచు గూరుచుండి, చేతి కందిన సుఖమును జాఱవిడుచును. శాస్త్రవిచారణ సిద్ధమైన దూరదృష్టి భారతము తన సొమ్మనుకొనును. ఆపదల నెట్లో గడవ నేర్తునని ఇంగ్లండు తా నుప్పొంగుచుండును. పరసుఖాపేక్షమై ఇహదుఃఖముల నుపేక్షించు భారతీయదృష్టికి, ఆంగ్లేయుని దృష్టికి గానివావి. ప్రత్యక్షసిద్ధమైన ఐహికసుఖానుభవమున నోలలాడు నాంగ్లేయుని జూచుచున్నకొలది భారతీయునకు దన పారమార్థిక దృష్టిపట్ల సంశయ ముప్పతిల్లజొచ్చినది.

భారతీయున కంతట వ్యవహారదృష్టి యలవడ సాగినది. ఎచట జూచినను దనయిచ్ఛమై, నిర్నిరోధముగా జనుచున్న భారతీయసంఘమే ఇందుకు సాక్షి. యూరపు ఇచటికి వచ్చునాటికి, ఏయెండ కాగొడుగు బట్టనేర్చు నీవ్యవహారదృష్టి భారతమునకు లోపించిపోయెను. ప్రస్తుతమైన దేశకాలానువర్తనము లేనివానికి హాని తథ్యము. బ్రదుకు నేర్పు చాలనినాడు మరణము ధ్రువముగదా! తుది మొగలు పాదుషాల కాలమునాటికే భారతీయసంఘమునకు బ్రాణశక్తి ఇవురజొచ్చినది. యూరపున కిచట లభించిన విజయ మీ ప్రాణశక్తినాశనమునకు ప్రతీకవంటిది. ఐరోపీయసంప్రదాయములు వచ్చి మీదబడినంతట సంఘమున కీ జాడ్యము వదలిపోయినది. తొల్లిటి పూరుషార్థములను బునర్విమర్శకు బాత్రమొనర్పవలసివచ్చెను. కనులముందు మెఱసిపోవుచున్న ఐరోపీయ సభ్యతను విజాతీయమని త్రోసిపుచ్చను లేము. అక్కఱకు మాలిన సంప్రదాయములను, చిరాగతము లను మమకారముతో అక్కున నద్దుకొనను లేము. ఈ రెంటి నొరపిడిచే ఆత్మవిచారణము రేకెత్తినది. లక్ష్యశుద్ధిమాత్ర మింకను లభించలేదు.

జ్ఞానఖడ్గమునకు అనుమానమే ధార. విచారణలేనిచో వృద్ధియు నుండదు. అనుమానవిచారణలు రెండును యౌవన లక్షణములు. భారతమునకు పునర్యౌవన ముదయించుట కీ విచారశీలమే గురుతు. పునర్యౌవన మెప్పుడును ప్రమాద భూయిష్ఠమని మనము మఱవజనదు. యౌవనోదయ మన్నిటిని తిరస్కరించి, నూతనలోకసృష్టికై పరితపించుచుండును.

పితృపైతామహమైన సొత్తులో త్యాజ్యమును, గోప్య మును నిర్ణయించు వివేకము చాలదు దానికి. బాహ్యలక్షణ ములను విమర్శించునే కాని ఆంతరమైన యశక్తతను స్పృశింప దది. నవయౌవనమే యిట్టిదగుచో బునర్యౌవనముమాట వేఱ చెప్పవలెనా ?

భారత జీవనప్రవాహమున కల్గిన యీ పోటు వ్యవస్థాహీనమై చెదరిపోకుండ, వివేచనాపూర్వముగ, నెమ్మదిమై పదిలపరచుకొనవలసియున్నది. శిథిలమైయున్న మన కాణాచిని పదిలముగా బాగుపఱచి, మన పుత్రపౌత్రుల కందింపవలెనన్న మనము వివేచనాపూర్వముగా దానిని మరల నిర్మింపవలెను. దీనిలో జేరిన చెత్తచెదారముల నేఱ నైచుటకు వివేకమే మనకు శరణ్యము. పరతంత్రుల మైపోయితి మను బాధ మనలో నొకవంక క్రోధతాపముల బుట్టించుచున్నది. అపలాపితమైన మనదేశచరిత్ర మింకొక వంక మనలో భిన్నమతములకు పరస్పర ద్వేషములను పెంచి యుంచినది. పరులు చెప్పినదైనను సత్యమును దిరస్కరింప జనదు. జీర్ణోద్ధరణమునే పునరుజ్జీవనమని భ్రమింపరాదు. మూలచ్ఛేదకులును, మతోన్మత్తులు నేకమై, పెంచుచున్న పక్షపాతములకు, ఆవేశములకు నగ్గమైపోరాదు.

తొలినాళ్లలో పాశ్చాత్యము నెల్ల నెత్తికెక్కించుకొని యూరేగితిమి. అందులకు బ్రతిఫలముగా నిపుడు పాశ్చా త్యముపేరు విన్నచో నేవగించుకొని కాలద్రోయుట పరిపాటి యైనది. దోషమును త్యజించినంతమాత్రమున గుణమును సంగ్రహించినట్లు కాదు. అంధమును, అవిచారితము *నగు

పాశ్చాత్య తిరస్కృతిచే నధికనష్టము మనకే కాని పాశ్చాత్యులకు గాదు. పోనాడదగని అమూల్యార్థము లెన్నో అకారణతిరస్కృతి కగ్గముగానున్నవి. ఇంతటనైన నీధోరణి మాననిచో విశ్వసభ్యతాతీర్థమునకు భారతము మరల దూరమైపోవును. వేర్పాటు ఒంటరిపాటునకు, నొంటరిపాటు మురిగిపోవుటకు రాచబాట కాగలవు. భారతము విశ్వవాహినినుండి చీలిపోవుట వినాశముకొఱకే.

కాలము నెవ్వరును వెనుకమొగము పట్టింపజాలరు. ప్రపంచమందు వివిధభాగములు నొండొంటితో బెనవేసికొని యున్న ఈ కాలమున వేరుపడుటెల్ల అర్థహానికి, నధికారహానికే యగును. లోకయాత్రాపరిణామమున భారతము గూడ హెచ్చరికమై తోడునడచుట లగ్గు. అట్లు కానినాడు భారతనౌక ప్రతికూలవాతహతి కగ్గమై, కను లప్పగించి నిలువవలసివచ్చును. భారతదేశభక్తమాత్రునకెల్ల నైరోపీయపురుషకారమహిమను కొనియాడుటకు మనసొగ్గనిమాట నిజమే. పురాతనమగు తన మహోజ్జ్వలసంస్కారపట్టాభిషిక్తతను, శోచ్యమైన నేటి దైన్యమును దలచికొని యాతడుద్విగ్నుడగును. నిజమే కాని ఐరోపీయులదెసనున్న గుణాధికతను గాదన్నంత మాత్రమున మనకేమి యొరగును? భారతీయమైనంత మాత్రమున దానిని మింటికెత్తుటయు బ్రయోజనకారి గాదు. తన హైన్యమును గప్పిపుచ్చుటకై లేనియాధిక్యమును బ్రకటించుట లోకస్వభావము. గుణలేశ మెచటనున్నను వివేచనమై గ్రహించి ఆత్మీయ మొనర్చుకొను జాతి నీరోగదీర్ఘాయువై మనగలదు.

# 6

# సాహిత్యాది కళలు

పాశ్చాత్య లోకముతో బరిచయము మన కాంగ్ల ద్వారమున లభించినది. ఆంగ్లము తనకు జీర్ణించినంతవట్టు మనకును బాశ్చాత్యసంస్కృతిని బంచియిచ్చినది. కావున బ్రధానముగా నాంగ్లేయభావములే మన కలవడినవి. ఇంగ్లండు భారతమున కొనర్చిన యుపకృతు లన్నియు నొక యెత్తు; తన భాషను, సాహిత్యమును మనకిచ్చుట ఇంకొక యెత్తు నందురు. నిజమే. తన్మూలమున మన యాచార ములలో, వేషములలో వచ్చిన కొంచెపాటి మార్పుల కేమి గాని, మన బుధ్యాత్మల స్వభావము నది చప్పగా మార్చి వైచినది.

యూరపునందలి యితర సాహిత్యములుగూడ మన కాంగ్లద్వారముననే పరిచితములైనవి. కాని, మన మాంగ్ల మునే ప్రధానముగా నెంచి వాని నుపేక్షించితిమి. ఐరోపీయ సాహిత్యములలో దేనిలక్షణములు దానివేకాన, అవి యన్నియు ఇంగ్లీషుమూసలలో నొదుగవు. అట్టివాని కాంగ్ల సాహిత్య లక్షణములను బట్టింపజూచితిమి. వానినే కాదు; ప్రాచ్యసాహిత్యములను గూడ మన మింగ్లీషు పడికాళ్లతో దూచితిమి. మన తూనికచే పాప మాసాహిత్యములు వికార భాజనములు, శోచనీయములు నై యూరకున్నవి. ఇంతకు నాంగ్లమున మన మెంత పొరలాడినను ఆంగ్లేయులకు నకళ్ల మగుదుమే కాని మన దృష్టియు, నాలోచనములు, అనుభావ

ములు బూర్తిగా నాంగ్లములై పోవుగదా! ఒరుల ననుకరింపజూచు వానరములకు సభ్యలోకపంక్తిలో నెన్నడును బీటలు వేయరని యెవ రెఱుగరు?

స్వభావముచే నాంగ్లేయులు మితభాషులు, లజ్జాశీలురు. నలుగురితో నట్టె కలిసిగోలుతనము నెరపక మూఁగ దీనికొనిపోదురు. రసభావములను నిగ్రహించుకొందురే కాని బయలుచేసికొనరు. అవిచారతయు, దొందరపాటు నెఱుగరు వారు. కావుననే వారికి నెపోలియను దుకాణదారులని పేరు పెట్టెను. వారు నిపుణముగా తూచిగాని దేనిని ఈయరు, పుచ్చుకొనరు. ఇదియెల్ల వారినిగూర్చిన పాశ్చాత్యదృష్టి మాత్రమే. నిగృహీతములగు ఈ రసభావములు ఆంగ్లేయుల కళాసృష్టిలో పైకుబికి అమేయములైన భావనా వీథులందు విహరించును. ఆంగ్లేయ కావ్యమందలి భావతీవ్రత మఱే సాహిత్యమందును గన్పించదు.

బ్రిటిషుస్వభావమందును, తత్కళాసృష్టియందును గన్పించు నీ విలక్షణత మన సాహిత్యాభిరుచులను తప్పుదారి బట్టించినది. రసభావప్రకటనము సాహిత్యలక్షణములం దేకదేశ మగునేకాని పరమ ప్రయోజనము గాదు. లాటిను సాహిత్యమునందు రసభావనిగ్రహమేకాని, ఆంగ్లమందున్న యీ యొలకబోసికొనుట యుండదు. సంతోష విచారములను ప్రకటించుకొననొల్లని ఆంగ్లేయుల స్వభావము మాత్రమే మనకు బరిచితముగావున అమెరికనుల అవ్యాజసరళవర్తనము మనకు వింతగా గన్పట్టును. ఆంగ్లసాహిత్యమందలి రసభావావేశమే మనకు బరిచితముగాన పరాసుల హేతువాదమును,

చైనీయుల సౌందర్యపరితనమును మనకు గ్రోత్రమై తోచును.

మన దేశీయసాహిత్యము, లాంగ్లేయులిచటికి రాక పూర్వమే, సంపన్నములై యుండెను. పఠాను మొగలు పాదుషాలనాడే వంగసాహిత్యము సర్వలక్షణశోభితమై యుండెను. మహారాష్ట్రమున అజరామరములగు భక్తికావ్యము లానాటికే యున్నవి. కబీరు మున్నగువారి యనుభూతియు, శైలియు మహోచ్చపద మలంకరించినవి. తులసీరామాయణము నేటికి నింటింట బారాయణయోగ్యమై వెలయుచున్నది. ఆంగ్లేయుల రాకచే నూతన సంఘశక్తులు మాత్రము విడివడి, వింతవేసముతోడి క్రొత్తసాహిత్య మొకటి యుట్టిపడినది.

ఆర్థికసాంఘికవ్యవస్థలలో మార్పు లీ నూతన సాహిత్యోద్యమమునకు దోహదములైనవి. సంఘశరీరమున గట్టిన పొరలు వంగదేశమున పేటెత్తినవని మున్న చెప్పితిమి. సంఘమున విస్తరిలుచున్న మధ్యశ్రేణికి తీరుబడి అధికముగా లభించుటచే కళాసృష్టికి, కళాభిరుచికి నవకాశ మొదవెను. భూమిశిస్తుల శాశ్వతనిర్ణయముగూడ నింకొక మధ్యతరగతికి దారితీసినది. ఈ శాశ్వతనిర్ణయమువలన భూమికి పెట్టుబడి కావలసివచ్చుటచే వర్తకవాణిజ్యములు మూలబడెను. భూమిని ప్రజ లంటిపెట్టుకొనియుండవలసివచ్చుటచే దేశమునకు సర్వతోముఖాభివృద్ధి కొఱవడెను. పేదవడిపోవుచున్న ప్రజాసమూహమునకు, దానిని బీల్చుకొని తిను సామ్రాజ్య నీతికి నీమధ్యశ్రేణి దౌత్యము నెఱపుటకు బనికివచ్చెను. ఇన్ని విధముల ననర్థకారియయ్యు నీ మధ్యశ్రేణి కళలపాలిట్టికి

మాత్రము కన్నతల్లియైనది. ఈ విధముగా వంగ దేశమున బైలుదేరినంతమంది సాహిత్యవ్రతులు నేటి భారతమున మఱొక్కచో గనరారు. తుదకు టాగూరు ఈ తరంగము మీదనే లేచి జగద్విఖ్యాతు డయ్యెను.

ఆంగ్లేయకావ్యప్రపంచముతోడి తొలి పరిచయమున జనించిన ఆవేశమే వంగసాహిత్యమునకు మధుమాసమై, పూతపుట్టించినట్లు కన్పించునుగాని, ఈ కుసుమోద్గమమునకు ఆ యావేశ మొక్కటియే కారణముగాదు. అప్పటికప్పుడే పాశ్చాత్త్యుల లాభసాటి వ్యాపారమిచట యాంత్రిక సాంఘిక రాజకీయ సంప్రదాయములను మార్చివైచి, క్షేత్రమును పదునుచేసి యుంచెను గావున నయ్యదన నొదవిన ఆంగ్ల కావ్యపరిచయ మీ నూతనకళావిర్భూతికి నిమిత్తమాత్ర మైనది. ఆంగ్లేయకావ్యములందలి రసభావతీవ్రత యపురూపమని మున్న చెప్పితిమి. సంఘవ్యవస్థకు, సదాచారమునకు దోహదము గాదగిన నిగ్రహము, సమతయు నాంగ్ల కావ్యములందు గన్పించవు. పురుషుని యనుభూతివ్యగ్రతయే వారి కావ్యములకు బ్రధానలక్షణము. కావ్యములందే కాదు, ఆంగ్లేయుల జీవనసర్వస్వమందును ఈ యహంతావ్యగ్రతయే గోచరించును. ఆంగ్లగృహస్థున కాతని యిల్లే దుర్గము. దాని కాతడే ఱేడు. ఈ యహంకృతియే మధ్యశ్రేణిసంసారులకు స్వభావమై పనుపడునుగావున బ్రిటీషుసభ్యత మధ్యతరగతిసంసారుల సభ్యతకు లక్ష్యభూత మైనది.

ఇట్టి మధ్యశ్రేణి విస్తరించుటచేతనే భారతీయసంఘ సుస్థితికి భంగము కల్గినది. స్వచ్ఛందానువృత్తియు, విధి

నిషేధతిరస్కృతియు యువజనమం దంకురించినవి. మన జాతిస్వభావమే మారిపోయి, సంశయాత్మతయు, వ్యక్త్యహంకృతియు నలముకొనుచున్నవి. కావుననే అహంకార వ్యగ్రములగు నాంగ్ల కావ్యములపట్ల మన నూతన స్వచ్ఛంద వృత్తికి సహృదయత్వ మేర్పడినది. ఈ క్రొత్తపొంగులు వంగభూమిలో మిన్నంట లేచినవి. బ్రిటిషు సాహచర్యము లభించిన పిమ్మట బయలుదేరిన వంగసాహిత్యమం దీ తిరస్కారాహంకార సంశయాత్మతలు దలయెత్తినవి. కవి కీ స్వచ్ఛందత తీవ్రమైనకొలది, ప్రపంచ మాతనికి విరోధియై కన్పించి, యాత డొంటరితనమును భజించును. టాగోరు కావ్యములందు బ్రచురమై కన్పించు కరుణకు, ఏకాంతత్వమునకు నీ స్వానుభూతిలోలతయే కారణము. ఈ స్వానుభవ వ్యగ్రత యింకను తీవ్రతర మగునేని, కవి, ప్రపంచముతోడి ఐక్యమునేకాదు, తన పూర్ణతనే కోల్పోవును. ఈ పూర్ణతానష్టి యొక్క వంగసాహిత్యమునకే కాదు; నేటి భారతీయ కళలకే సామాన్యలక్షణ మైపోయినది.

ఆచార సంప్రదాయాదులే సంఘసుస్థితిని రక్షించుచుండును. పురుషాహంకృతి విస్తరించునేని సంఘము విచ్ఛిన్నమగును. పురుషుడు సమష్టి నారాధింపక, తదతీతుడై, స్వేచ్ఛను భజించునేని సంఘస్వరూపమునకు జేటు వాటిల్లును. అట్టి సంఘశైథిల్యమునకు బ్రతిఫలరూపములై, సాహిత్యాదికళలలో క్కొక్కప్పుడు హఠాత్తుగా విజృంభించును. ఆత్మవ్యక్తియే కళలకు మూలధర్మము. అట్టి వ్యక్తీకృతి లేని శిల్పములు గాంచి, రసజ్ఞులు నీరసమని పేదవి

విడుచుచుందురు. కావున సమష్టిని వ్యష్టి యధఃకరించెడిసంఘ విపర్యయములం దీకళలకు వికాస మొదవుననుట యుక్తమే. మన దేశమున నిట్టి కళావికాసమును, మధ్యశ్రేణిసంసారుల విస్తృతియు నేకకాలమందే యొదవుట కాకతాళీయము గాదని తోచుచున్నది.

భారతీయకళల నావరించిన నేటి యుజ్జీవనమునకు లక్ష్యభూతములగు వాస్తుశిల్పములుమాత్ర మెందును గన రాకున్నవి. భారతీయుల స్వభావశీలముననే యీలోప మున్న దనుకొొంద మనిన, తొల్లిటి వాస్తుశిల్పములు భార తీయుల సౌందర్యబోధమునకు సాక్షులై నిలిచియున్నవి. దక్షిణభారత దేవాలయముల మహత్త్వ గాంభీర్యములకు వానియందు విలసిల్లు రూపకల్పనా వైవిధ్యవైచిత్ర్యములే కాక మఱియొందు సాటిగలదా? మొగలు మసీదుల రేఖా సౌభాగ్యమును గాంచిన శిల్పిలోకమెల్ల నీనాడును ముగ్ధ మగుచునే యున్నది. మఱి, అద్భుతమైన అట్టి మహాచ్ఛిల్ప సృష్టి యిటీవల నేల లోపించిన దన్నచో, వాస్తుశిల్ప స్వభావమే అందులకు గారణమని తోచును.

కవులు నిజలక్ష్యసిద్ధికై యొంటిమై యాత్రసల్పు దురు. చిత్రలేఖకులుగూడ ఏకాంతికత్వమున రూపసిద్ధి నారాధింపనేర్తురు. సంగీతము మాత్రము వ్యక్తి నతిక్రమింప జాలునుగాని. అదియును పురుషుని యానందపారవశ్య మందే జనించును. వాస్తుశిల్పముమాత్ర మట్టిది గాదు. అడుగడుగున దానికి సమష్టిసంబంధ ముండితీరును. పదిమంది చేతులు పడనిచో ఆలయాదిమహాశిల్పములు రూపెత్తవు.

ప్రధానశిల్పితోపాటు ఉపశిల్పులుగూడ శిల్పనిపుణులైననే కాని నెరవేర వవి. అట్టి శిల్పములందు యావత్సమష్టియు నేకార్థమున నడుముగట్టును. ధర్మప్రయుక్తమైన అట్టిసమష్టి మహోద్యమమందే మహాశిల్పములకు ప్రతిష్ఠ లభించును. యూరోపునందలి గోథికుశిల్పము లేమి, దక్షిణభారతమందలి కొండగోపురములేమి, సారసను మసీదు లేమి, అంతశ్శాంతిమై నొక్కటిగా మనిన సంఘములు దాల్చినమూర్తులే. సంఘైక్యమునకు భంగమువాటిల్లిన వేళలందు వాస్తుశిల్పమే ఛాయాదేవతకు తొలిముద్ద యగుచుండును.

## 7

## బా ల నా య క ము

దేశములో నిపు డెచట జూచినను యువజనమందు తిరస్కారభావము కనులకు గట్టినట్లు కనిపించుచున్నది. ఒక కులము, ఒక మతము, ఒకరాష్ట్రమని లేకుండ దేశమంతట నీ తిరస్కారప్రభంజనము వీచి, స్త్రీపురుషు లందఱిని జుట్టుముట్టుచున్నది. వినయవిధేయతలకు బుట్టినిల్లని పేర్వడిన కర్షకలోకముగూడ తెనుగుమీఱిపోవుచున్నది. కార్మికలోకము తనకు మానవోచితమైన జీవనసౌఖ్యము గావలెనని నిగ్గదీసి అడుగుచున్నది. విద్యార్థిలోకము సరియేసరి. గురుభక్తియు, వినయము వారి నెన్నడో వీడిపోయినవి. స్త్రీజనముగూడ వెనుకబడలేదు. పురుషునితో సమానములగు స్వత్వములకై గోలచేయుచునే యున్నది. తాతలనాటి సంప్రదాయములను, విధినిషేధములను దవ్వుల నిట్లు జార

విడిచి, పడుచువాం డ్రందఱు ముందుకు బడద్రోసికొని యరుగుచున్నారు.

పడుచువాండ్ర యీ ధిక్కృతిని గాంచిన పెద్దలును, అధికారధూర్వహులును ఇది యంతయు నశిక్షితమగు పిల్ల మూక సలుపు నల్లరియని యెంచుచుందురు. ఈ కుఱ్ఱమూక వలన దేశమునకు ముందుముం దేమిగతి పట్టనున్నదో యను భీతిగూడ పెద్దల నావహించుచుండును. కాలస్వభావమును గమనించినచో నట్టిభీతికి గారణము కన్పించదు. పూర్వపు రాజనీతులు, నర్థనీతులు నిస్సారములై, నేడు పనికిరాకుండ బోయినవి. వెనుకటి ధర్మములు, సంఘపు గట్టుబాట్లు పట్టు దప్పి, పసయుడిగినవి. ఈశ్వరభక్తివలన గూడ నూరట జనించుట లేదీనాడు. ఏపని చేయుదమన్నను, ఏయాలోచన చేసినను అంతయు అనిశ్చితముగా, సంశయాస్పదముగా నుండి, అడుగు సాగుటలేదు. తొల్లిటి యూరటపట్టులెల్ల నంతరించినపుడు యువజనము సంక్షుభితము కాకుండుటెట్లు?

పడుచువాండ్ర యీ యస్తిమితవృత్తిని గాంచి, పెద్దలు భీతిల్లుటయు సాజమే. వారు ప్రాతసంప్రదాయములో పుట్టి పెరిగినవారు. వేదశాస్త్రములయందు ప్రమాణబుద్ధియు, పెద్దలయెడ, ప్రభువులయెడ భక్తియు వారి కభ్యస్తము లైనవి. మతవిషయమునగూడ వారు శబ్దప్రమాణము నంగీకరింతురు. 'స్థితస్య గతి శ్చింతనీయా' అన్నట్లు, ఉన్నదానికి భంగమువాటిల్లుటకు వా రంగీకరింపరు. ఈప్రామాణ్య బుద్ధి నిస్లాము చలింపజేసినదే కాని, పెల్లగింపలేకపోయినది. ఇస్లామునకుగూడ శబ్దమే (కొరాను) పరమ ప్రమాణము.

పూర్వాచారపరిరక్షణమును, ప్రామాణ్యబుద్ధియు క్రైస్తవమున మఱియు నెక్కుడై కన్పించును. ఈవిధముగా భారత మతము లన్నియు సంఘస్థితిని రక్షించుటకే యుద్యమించినవి. సడిచప్పుడులు లేకుండ జరగిన మార్పులు తుదకు స్పష్టముగా రూపెత్తుదనుక పెద్దలకు గోచరింపలేదు. పూర్వ సంప్రదాయవిరుద్ధములగు సంఘపరివర్తనములను కనులార గాంచునప్పటికి పెద్దలకు గలవరము జనించెను.

సామ్రాజ్యనీతి ప్రమాణధిక్కారమును, స్వచ్ఛందతను సహింపదనుట తెల్లము. మన దేశములో నాదినుండియు నూతనధర్మ మవతరించినపు డెల్ల నూతనసామ్రాజ్యము గూడ నవతరించుట పాటియై చెల్లెను. ఆదికాలమున బౌద్ధబ్రాహ్మణ మతముల వృద్ధిక్షయములు సామ్రాజ్యములతోడి పాటివే యయ్యెను. ఇస్లాము ధర్మము ముస్లిము సామ్రాజ్యముతో జతగావచ్చినది. క్రైస్తవమతముతోగూడ బ్రిటిషు సామ్రాజ్య మవతరించినది. మన పెద్దల యుపేక్షకు ఈ నూతనధర్మ నూతనసామ్రాజ్య యుగపదవతరణములుగూడ కారణమని తోచును.

ఇస్లాముక్రైస్తవమతము లీ దేశమునకు ఖడ్గసహాయముతో రాలేదు. ఆ మతస్థులు క్రమముగా యుద్ధవిజయములను సాధించినపిమ్మట వాని కిచట బలము చేకూరినది. ఈ కారణమున ఆత్మబలబాహుబలములు రెంటికి అభేద మేర్పడినది. మహమ్మదీయప్రభువుల రాజనీతివైరుధ్యమునందిస్లాముధర్మప్రాశస్త్యమును, బ్రిటిషు రాజనీతికౌటిల్యమునందు క్రైస్తవధర్మప్రశస్తియు మాటుమణగిపోయినవి.

సామ్రాజ్యము లిట్లు ధర్మముల కండయై నిలిచి, ధర్మవిచారమును, వివేచనమును అరికట్టినవి. విద్యాపద్ధతులు వ్యష్టి సమష్టుల బుద్ధిని, చిత్తమును మార్చివేయనేర్చునుగాన వివేచనావిమర్శనములను, అవిధేయతను తలలెత్తనీయని విద్యా సంప్రదాయముల నీ యుభయసామ్రాజ్యములు నిచట నెలకొల్పజూచినవి.

ఈ పూర్వరంగ మంతయు నిటీవల చల్లగా, చప్పగా మార్పు జెందినది. యంత్రములు వస్తువులను విరివిగా నుత్పత్తి చేయసాగినవి. ఆ వస్తువులను దూరసీమలలో వెంటనే విడుదలచేసెడి రైళ్ళు, స్టీమర్లు, మోటార్లు పుట్టుకొనివచ్చినవి. ఈవిధముగా వివిధభాగములకు ప్రజల రాకపోక లధికమయ్యెను. భావప్రచార మిట్లు సాగినంతనే మతధర్మాదులకు, సంప్రదాయాదులకు క్రొత్తబలము చేకూరెను. పట్టణముల పలుకుబడి హెచ్చినది. నాగరజీవన మెప్పుడును తుకతుకనుడుకుచు గ్రింకుమీదులగుచుండును; అట్టి పట్టణములకు పలుకుబడి హెచ్చినంతట సంఘమునకు గదలికపుట్టినది. రైళ్ళు, పోస్టు, అచ్చుయంత్రములు నేకమై మతప్రాకారములను గూల్చినవి. అంతటితో ప్రామాణ్యబుద్ధికి నూరేండ్లు నిండినవి.

ఈ సమయమందే మధ్యశ్రేణి సంసారులు వర్ధిల్లి, ధిక్కారమును, అరాజకమును పెంచిరి. పూర్వప్రామాణ్య బుద్ధి నశించుట కిదియు తోడ్పడెను. పడుచువాండ్రకు విమతస్థులు, విజాతీయులు సెప్పు పలుకులే హితమయ్యెను. అర్థనీతిరాజనీతుల పరస్పర విరోధములచే సంఘమున నూతనా

స్వాస్థ్యము తలచూపినది. బ్రిటిషుసామ్రాజ్యనీతి మధ్యతరగతుల వృద్ధికి తోడ్పడినదేకాని ఇచటి పెట్టుబడివ్యాపారముల కడ్డుదగిలినది. అల్పసంఖ్యాకులగు విద్యావంతులలో ఈ కారణమున అసంతృప్తి పుట్టి, బ్రిటిషురాజనీతిపై ధ్వజమెత్తినది. ఆ యసంతృప్తియే సంఘమందంతట నల్లుకొని ధిక్కారమునకు, ఆందోళనకు దారితీసెను.

కావున, నేడు భారతజీవనమున గన్పించు బుగబుగలు కాలవశమున వచ్చినవే. భారతభాగధేయ నిర్మాతయగు కాలధర్మమే సంఘప్రామాణ్యమును, విద్యాప్రామాణ్యమును ధిక్కరించుచున్నది. చెఱవీడిన మానవబుద్ధి కొన్నాళ్లు పరవళ్ళు ద్రొక్కుచుండును. ఆ శివము చల్లబడినపిమ్మట మరల నంతటి యావేశముతోడనే గట్టుకొయ్యకు జేరుటయు గద్దు. ఈ పోటుపాటుల రెంటిమధ్యమున పరుగు లింక నట్లే యున్నవి. శాస్త్రాదివిధులను దలదాల్చు సంఘము స్వబుద్ధిప్రమాణప్రమితమైన సమతాధర్మము నాశ్రయించనున్న తరుణమున నిట్టి బుగబుగలును, పొంగులును, ఆందోళనము, ననిశ్చయమును దలచూపుట తప్పదు.

ఈ పరివర్తనపరంపర లన్నియు రూపాంతరసిద్ధి కొఱకే జరుగుచున్నవి. చిరకాల మలక్షితములై జరుగుచున్నవేకాని ఈ మార్పులు కాకతాళీయములు, హఠాత్సంభవములు గావు. తమోభిభూతచిత్తవృత్తులు, నాచారపాశబద్ధులు నైనవారికిమాత్ర మీమార్పులు విపరీతముగా గనుపించుచున్నవి. ఇంతకు, నాచారములు మాఱుచున్నవే కాని, విశ్వాసము లట్లే యున్నవిగావున వీనిని గొండంతలు

చేసి దిగులుసెంద బనిలేదు. విమర్శనాత్మకమైన మథనము సర్వవ్యాప్తమైనదేకాని యింకను ప్రగాఢత చెందలేదు. నేటి చిత్తవృత్తులు కాలాంతరములనాటి రాగద్వేషము లతో కలసిమెలసియున్నవిగాన ఈనాటి భారతీయుల ఆలోచనలలో, అనుభవములలో, చర్యలలో అనేక కాలముల లక్షణములు గోచరించుచున్నవి. మూడుకాలములును వింత యల్లికలతో, ముప్పిరియై, విడదీయరాక, వివేచింపరాక, పెనచికొనిపోయినవి.

## పునరుజ్జీవనము - జీర్ణోద్ధరణము

సందెచీకటిలో మసమసకనీడలనే కాంచి, అదియే భారతజాతీయతయని కొందఱిచట భ్రమించుచుండు టొక వింత. కులమతాభిమానములే సమతాధర్మ వేషము దాల్చి మన దేశమున నూరేగుట మఱొకవింత. సంఘమందందఱను సమానధర్మమే వర్తింపజేయుటకై పుట్టిన సమతాధర్మ మును దమతమ మతములకు, కులములకు నన్వయించి, మన దేశమున గొందఱు తమ పబ్బములను గడపికొనుచున్నారు. పరపీడితులగు దీనుల నందఱి నేకమొనర్చి, ఒక్కయడుగుపై నడపవలసిన సమతాధర్మ మిచట కులమతభేదములను బరిరక్షించుటకు బనికివచ్చుచున్నది.

పునరుజ్జీవన జీర్ణోద్ధరణముల కీ విధముగా నిచట మష్టాష్టకము పట్టినది. భారతసంఘ మనేక పరంపరా సిద్ధమైన లంగరునుండి విడివడ్డది. శాస్త్రాచార ప్రమాణముల పట్టు

తప్పి, అంతయు నస్తవ్యస్తమై, సంశయావస్థలో బడిపోయి నది. పూర్వపు బోరుసార్థములు బూదిపాలైనవి. ప్రపంచమున నానాదేశవ్యవహారము లొండొంటి బెనచికొని పోవుటచే నేదేశమున కాదేశము తనదారిని నిశ్చింతమై నడుగుపాకము తప్పిపోయినది. లోకవ్యవహారమునకు బ్రవర్తకులగు సూత్రధారుల ముక్కుమొగము మన మెఱుగము. మన కష్టసుఖములను సరకుసేయకయే వారు మన చావుబ్రదుకులను నిశ్చయించుచున్నారు. కావున ప్రజాసంఘములు కట్టుదప్పి, అశాంతిమై నాయాసపడిపోవుచున్నవి.

ఇట్లు బుగబుగలతో పొంగులెగయుచున్న యీ పురాణభారతప్రజ నిలుకడదక్క నడువసాగినది. ఏలక్ష్యము దెస కేగుచున్నదో ఇంకను స్పష్టపడలేదుగాని ప్రసవవేదన మాత్రము తథ్యమై యగుపించుచునే యున్నది. ఆదికాలమునను, మధ్యకాలమునను భారతజీవనమున రంగపరివర్తనము లెన్నియో జరిగినవిగాని, ప్రాతసంప్రదాయములతో నింతటి తెగతెంపులు మున్నెన్నడు బుట్టినట్లులేదు. గడచిన రెండుశతాబ్దులును, ముఖ్యముగా నీ నలుబదియేండ్లును అపూర్వములైన సంఘటనల కాలవాలమైనవి. ఈ మార్పులలో నూతనారంభమే కాని ప్రాతపోలిక లించుకయు గోచరించుటలేదు.

చిరకాలమునుండి అవిరతమై జరుగుచున్న మార్పులే యిట్లు ఫలించినవిగాన నీ యారంభమును సరిక్రొత్త యనుటకును వలనుపడదు. తొలినాళ్ళతోడి బంధనము తెగినదన్నను గాదనజాలము. ఇట్టిప్రా ద్రొక్క భారతము నొస,

టనే పొడవలేము. ఈ నాలుగుశతాబ్దులనుండియు మానవ సభ్యతాసంస్కారములు చెందినమార్పు లొకయెత్తు, అంతకు బూర్వ మనేకకాలములందు జరగిన మార్పులన్నియు నొక యెత్తై తోచుచున్నవి. మానవసంఘగతి సంభ్రమమును గాంచినచో కనులు దిరిగిపోవుచున్నవి.

మానవలోక మట్లు వాయువేగమున జెందుచున్న మార్పులలో మున్నెన్నడు లేని ఏకత్వముగూడ కన్పించుచున్నది. లోకమున దొల్లి యెన్నియో సభ్యతలు రూపెత్తినవిగాని లోక మంతట నేకసభ్యత అవతరించినట్లు వినము. భారత సభ్యతకైనను, రోమకసభ్యతకైనను దేశావధి యుండెడిది. చైనీయసభ్యతకూడ నట్టిదే. అరేబియను సభ్యత యెంత విస్తరించినను సర్వలోకవిస్తృతము గాదు. ఏకసభ్యతావతరణమునకు మున్నెన్నడు ఆనుకూల్యము లభించినదికాదు. నేడన్ననో, దేశకాలములు వశీకృతములగుటచే విశ్వసభ్యతావతరణమునకు ముహూర్తము గుదిరినది.

మానవకోటి యంతయు నొక్కటికావున అందరికి సమానధర్మమే వర్తింపవలెనుగాని పరపీడనము, పరపాలనము బనికిరాదు. ఇట్టి యుదారభావముచే నీ విశ్వసభ్యత ప్రేరితమైనదిగాన సంఘమున హెచ్చుతగ్గులను, అన్యాయమును బెల్లగించుటకై ఆయత్తమగుచున్నది. మానవశక్తిని బంధముక్తమొనర్చి, ప్రతిపురుషునకును తీరిక ఇచ్చుటకు సమర్థమైన యంత్రమును సాధ్యసాధనముగా గైకొన్నదీ విశ్వసభ్యత. పంచభూతప్రకృతి నిచ్చవచ్చిన ట్లాడింపనేర్చితిమిగాన మానవు నిక పాశబద్ధు నొనర్పబనిలేదు. జాగృత

బుద్ధులగు స్త్రీపురుషులెల్లరు నట్టి నూతన సంఘవ్యవస్థను గూర్చి కలలుగనుచున్నారు. ప్రకృతిని వశీకరించుటవలననే మానవునకీ నూతనసంఘదర్శనము లభించినది.

తొల్లి యసంభావ్యము లనుకొన్నవి నేడు ప్రకృతి వశీకృతిచే సాధ్యములై తోచుచున్నవి. మున్ను మహారాజులేనియు నెఱుగని భోగము నేడు నిరుపేదగేస్తులకుగూడ కరతలామలకమైనది. తొంటిమహారాజభోగములే నేడందఱికి నిత్యసుఖములుగా పరిపాటియైనవి. ఈ సౌకర్య మొక దేశమునకే కాదు; లోక మంతటికి సంభావ్యమగుచున్నది. పూర్వమొకానొక దేశములో నొకానొకసంఘము గుత్తగొన్న సౌఖ్యములు నేడొక దేశమునుండి యొక దేశమునకు ప్రాకి, మానవకోటి కంతటికి చేజిక్కుటకు వీల్లు గన్పించుచున్నవి.

ఏకసభ్యతావ్యాప్తి లోక మంతట సుకరమైనట్లే, తన్నాశముగూడ నేడు సుకరమే గాగలదు. పూర్వము సభ్యత లొక దేశమున, నొకానొక సంఘమున లోపించెడివి. వాని నింకొక సంఘమో, దేశమో అవలంబించి, పరిరక్షించుటకు వీలుండెడిది. నేడట్లు గాదు. దేశకాలముల నతిక్రమించు యంత్రపరికరముచే లోక మంతయు నొక్కటియైనది. సర్వజగన్నాశనసమర్థములగు మారణ శస్త్రములు సుసంపన్నములై యున్నవి. ఒక్క లోకము, నొక్క సభ్యతయు నేడవతరించినవి; కాకున్న, నెల్లి యవతరించును. కావున నిక సర్వనాశమే కాని ఏక దేశనాశమనుచు నుండదు. అట్లే శాంతియు, స్వతంత్రతయు, బురోగమనమును సర్వమయములై చెల్లవలసినవే.

అపకారము విరోధమును బుట్టించును. కావున అపకారమూలమును బెల్లగింపనిచో, లోకసభ్యతాప్రసాదమొక్కపరి కుప్పగూలిపోవుట తథ్యము. ఈ పాతికయేండ్లలో నుప్పతిల్లిన మహాయుద్ధముల రెంటివలన నట్టి సర్వనాశన ప్రమాదము తప్పదని తెల్లమైనది. సామ్రాజ్యనీతి కెంత మసిబూసినను దానివలన లోకశాంతి లభింపదు. దానిపుట్టుకతో బుట్టిన స్వప్రయోజనపర్వతము పుడకలతోగానిపోదు. ఆ స్వప్రయోజనపర్వతమే పరాపకృతికి మూలము. కావున సామ్రాజ్యనీతికి దిలోదకము లీయనిచో నీ విరోధములు చావవు. మానవసంఘము పదికాలములపాటు మనగోరునేని, ధర్మమును నెలకొల్పగోరునేని సంఘమున నూతనవ్యవస్థ చేసి తీరవలెను.

అట్టి నూతన ధర్మనిర్మాణమునకు భారత స్వతంత్రతయే పునాది. పరాధీనతవలన భారతమునకు దాస్యమును, అంతస్తాపమును దప్పవు. అపారభారతప్రజయు, దాని అమేయ సంపదయు లోకశాంతికి గాకుండబోవును. అర్థనీతియందలి అసౌకర్యమువలననే నేడు భారతీయప్రజాసంఘము ఘూర్ణమానమగుచున్నది. మతకలహములకు, రాష్ట్రవిభేదములకు గూడ బ్రదుకుదెరువుకై ప్రాకులాటలే మూలకారణమని నిపుణముగా బరిశీలించినచో దెల్లమగును. భారతపరిశ్రమలు నాశనమొనర్పబడినవి. నానాట బెరిగిపోవుచున్న ప్రజను వ్యవసాయవృత్తి యొక్కటియే పోషింపజాలదు. ఎటు జూచినను సేవావృత్తియే బ్రదుకుతెరువుగా నున్నది. కావున బ్రదుకుతెరువై మిగిలిన ఆ సేవావృత్తికోసమే నేటి

కలహములు, స్పర్ధలును. బ్రదుకుదెరువునకై యారబ్ధమైన యీపోరాటములో వ్యక్తులు, సంఘములు వేని కందిన యాయుధముల నవి యుపయోగించును. సంపన్నులు నేటి సాంఘికరాజక వ్యవస్థలందుగూడ తమ భోగములను జెక్కు చెమర్పకుండ పిండికొని యనుభవించుచునే యున్నారు. పెట్టుబడి వ్యాపారులు, జాతిమతభేదము లేకుండ, నందఱు సుఖసంపాదనమున సహజపండితులు. పరపీడకుబాలైన నోరు లేనిప్రజను కన్నుగప్పుటకై మతభేదమును వారు ప్రయోగించుచుందురు. సంపన్నునకు ఈకులాభిమానమే తుదిప్రాపు.

సంఘమందున్న వ్యత్యయములు గనరాకుండ నిట్లు కనుగప్పినంతనే చిక్కులు తీరిపోవు. రేకెత్తిన కులమతద్వేషములు హృదయమును గలంచుచునేయుండును. సంఘపుగట్టు బొట్లు సడలబారినవి. చిరకాలముగా, నిగ్రహమున్మై నిర్మించుకొన్న నియమములకు, చారుచర్యకు ముప్పుమూడుచున్నది. పోటువచ్చినపుడు పొరలబారకుండ గట్టుకొన్న కఱకట్టవంటిదే సంఘవ్యవస్థ. ఆ కఱకట్ట గట్టిగా నున్నంతవరకు నీటిపోటువలన భీతియుండదు. కట్టలోనే యింత గండి పడినను కట్టతోపాటు తత్పరిరక్షితమైన జనపద మంతటికి ముప్పుపుట్టును. సభ్యత యొనర్చు సంఘనియమములు గూడ నిట్టివే. ఆ కట్టు తప్పినపుడు సంఘజీవన మంతటికి హాని కలుగును. కులద్వేషములే తుదకు నంతర్యుద్ధములుగా బరిణమించును. అంతర్యుద్ధములే దేశాంతరములతోడి యుద్ధములను దెచ్చిపెట్టును. యుద్ధములు పొసగకుండనే యుండవలెను గాని పొసగినచో నేటి అమోఘమారణాయుధములు మానవ..

లోకమును, తత్సభ్యతను ద్రుటిలో హతమార్చును.

కావున భారతస్వాతంత్ర్యము లోకమంతటితో బెన వైచుకొనియున్నది. విశ్వజీవనసముద్రమున బుట్టిన పోటు భారతసముద్ర తీరమునకు వచ్చి తగులుచున్నది. ఏకము, నఖండము నగు విశ్వజీవనస్రవంతిపై దేలియాడు భారత నౌక దాని పాటుపోట్లు తప్పించుకొనజాలదు. భారతము పరతంత్రమై యుండునేని విశ్వనాటకరంగమున దాను పాత్ర ధారణమునకు జాలక, ఆ ప్రవాహ మోటు లీడ్చిన నటు గొట్టుకొనిపోవును. ఈయవస్థ భారతమునకు, లోక మతంటికి గూడ ముప్పే. భారతము నేయొక్కరో పీల్చుకొని తినుట నితరులు సహింపరు. ఆ స్పర్ధలే యుద్ధ ప్రళయమును దెచ్చి పెట్టి లోకశాంతిని భంగించును. ఈ పరాధీనతయే భారత మును నిజస్వభావానుగుణముగా వర్ధిల్లనీయకున్నది. పరుల కాలిక్రిందబడి, ఆ యవమానముచే ఘూర్ణిల్లుచు, అంత స్తాపమ్మున కెరయై, భారతము అంతర్వైరములచే గుమిలి పోవుటయేకాక, బహిఃప్రపంచమున కంటురోగ మైపోయి విశ్వప్రళయమును దెచ్చిపెట్టును. అట్లుగాక, భారతము స్వతంత్ర మగునేని శాంతిమై చెన్నారి, లోకశాంతికి పెట్టని కోట కాగలదు. సమీపప్రాచ్యమును దనయందు జేర్చికొని, యచటి సంక్షోభముల నరికట్టను గలదు; లోకశాంతి కాములకు బోరానిచుట్టమును గాగలదు.

భారతమునకు జిరతరమును, శబలము నగు సంస్కార సంపదయున్నది. లోకమున కా సంపదను భారతి చేతులార పంచిపెట్టగలదు. పెద్దకాలము నుండి నిద్దురకుబడిన యీ

యవ్వను పశ్చిమఖండము ప్రబలముగా దట్టి లేపినది. మేల్కొన్న యీ ముదిమేనిలో క్రొత్తపరువము పొంగులారుచున్నది. ఆమెచైతన్యగర్భమున మథన మారంభమైనది. ప్రాక్పశ్చిమముల దృష్టిభేదములచే నామెలో నూతనదృష్టి మేల్కొనుచున్నది. ఆ దృష్టిచే నూతనపరమార్థమును దర్శింపవలసియున్నది. ప్రాబడిన యాచారమాఢ్యమును కడిగి వేయవలసియు నున్నది. పందొమ్మిదవ శతాబ్దిలో నిచట నెందరో సంస్కర్తలు వరుసమై నుద్భవించిరి. వారు పైపై నున్న ధూళిని తుడిచిరేకాని అంతర్మలినములను గడుగ లేరైరి. ఆర్థికరాజకీయసంస్కరణములకు గూడ నా గతియే పట్టినది. ప్రాతవలువను జించివైచుటయే యైనదిగాని నూతనదివ్యవసన మర్పింతురని నమ్మకము పుట్టుటలేదు.

నేటి భారతకళాలక్ష్మిమాత్రము పూర్వ సంపదౌన్నత్యమును స్మృతికి దెచ్చుచున్నది. పురుషుడు పరమైకాంతమున నొనర్చు సాధనలే యీ కళలు. సమష్టి సాధనకు మూర్తులైన వాస్తుశిల్పము, నాటకమును నవభారతమున నింక నవతరింపవలసియున్నవి. కావ్యచిత్రకళలైనను కేవలైకాంతమున చిరకాలము వర్ధిల్ల నేరవు. స్వజాతికుక్షియందు నిక్షిప్తమైన అమృతకలశమును జొచ్చి చూఱలాడినగాని కళలకు బుష్టి యొదవదు. పర్వతపాదములందలి మట్టిపొరలో మొలుచుకొనివచ్చిన నాగజెముడువలె నున్నవి నేడు భారతీయకావ్యములును, చిత్రరచనములును. అవి యుజ్జ్వలములయ్యు, విజాతీయములుగాన స్వప్రజాహృదయమున వేరు దన్ని నిలువజాలవు.

తత్త్వవిచారమున నవభారత మించుకంతయు సమన్వయము సాధింపలేకపోయినది. నేటి ఘృత సిద్ధాంతములను, సభ్యతామూలధర్మములను తత్త్వవేత్తలు పరిశీలింపవలెను. మానవుడు తనమతమునుగూర్చి సల్పెడిపరీక్షయే తత్త్వవిచారమనిపించుకొనును. లోతుపాతుల గట్టిలేనిచో సభ్యతలు, సంస్కృతులు మనజాలవు. ఒకచెంప సభ్యత విచ్ఛిన్నమైపోవుచు, సంస్కృతియు పునఃపాకమున బడుచున్నపుడు తత్త్వానుశీలన మెట్లు సాగును? గడచిన మూడునాలుగుశతాబ్దులలో భారతీయసభ్యతాసంస్కృతులు వట్టిపోయిన వనుటకీ తత్త్వ మథనశూన్యమే ప్రబలసాక్ష్యము.

కాని, అల్లదిగో! నలుదెసల బురుటినొప్పు లుదయించుచున్నవి. భారతీయజీవనమున బుగబుగలును, ధర్మవిచారమున గవ్వపుమ్రోతలును వినుపించుచున్నవి. నూతన ప్రపంచోదయమునకు నెలలు నిండినవి. గ్రహతారకములొండొంటి నొరసికొని, వెలుగువెల్లువలో గరగినపుడుగాని నూతనభాను డుదయింపడు. సమన్వయపరిష్కృతులు ప్రాచీన భారతమున కుగ్గుతో బెట్టిన విద్యలు. వర్తమానలోకము గూడ నూతన జీవనోత్సర్గమునకై తహతహలాడుచున్నది. తొల్లిటి ఏకత్వసంప్రదాయముతో నేడు సమతాధర్మములు వియ్యమందగోరుచున్నవి. భారతమున సీ ప్రాతక్రొత్త లొండొంటిని డీకొనినగాని నూత్నపురుషు డుద్భవింపడు. ఈ పురాణకురుక్షేత్రముననే మరల విరుద్ధశక్తులకు పోరు పొసగినది. యువభారత మీ సంగ్రామమున పరికరము బంధించి, కృతాస్త్రమగుగాక! శీర్యమాణసభ్యతలనుండి

గుణరత్నము లేరికొని, నూతనసభ్యతను తీర్చిదిద్ది అలంకరింపవలసియున్నది. ' ప్రాచీన మధ్యకాలిక నవయుగీన సంస్కారసంపదలను గలియఁబోసి, నూతన సమన్వయమును సాధించు భారము యువభారతముపై నున్నది.

